# సరస్వతీ సామ్రాజ్య వైభవము




ప్రాచీన కవయిత్రి

కవితా వైభవ

సాహిత్య రూపకము

కళాప్రపూర్ణ కనకాభిషిక్త, ఆంధ్ర సరస్వతి, అపరవాగ్దేవి

డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

# సరస్వతీ సామ్రాజ్య వైభవము

ప్రాచీన కవయిత్రీ
కవితా వైభవ
సాహిత్య రూపకము

కళాప్రపూర్ణ కనకాభిషిక్త, ఆంధ్ర సరస్వతి, అపరవాగ్దేవి

**డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ**

# SARASWATHI SAMRAJYA VYBHAVAMU



వెల రు. 6-00

ముద్రణ :

శ్రీ రాధాకృష్ణ ప్రింటింగ్ ప్రెస్, బాపట్ల

ప్రాప్తి స్థానము :

డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ,

బాపట్ల



# అంకితము

అంకితమిది అంకితమిది
మహాంధ్ర భారతికి !

అంకితమిది అంకితమిది
మహిళా సాహితికి !!

అంకితమిది అంకితమిది
కళ్యాణ వాణికిని !!!

అంకితమిది అంకితమిది
కలభాషిణికిని !!!!

—0—

ఓం

# సరస్వతీ సమర్చనం

"అమ్మా! లక్ష్మీకాన్తమ్మగారూ! ఆంధ్ర కవయిత్రుల ప్రజ్ఞా పాటవాలు, లోకంలో సుప్రకాశితాలయ్యేటట్లు మీరు ఒక రూపకం వ్రాయ రాదా?" అన్నారు మాన్యులు, సోదరులు, రసావేశ నిర్భర హృదయులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు! ఈ ఊహ నా మనస్సులో ఎప్పటినుండో దోబూచులాడుతున్నదో!

ఎప్పటిదో ఈ మాట!

ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ రజతోత్సవాలలో వినూత్న ప్రక్రియగా దీనిని ప్రదర్శింపచేయాలనే ఊహతో మాన్యసోదరులు నాకు ఈ సూచన నిచ్చారు!

రూపక రచనం అప్పుడే జరిగింది! కానీ ఆ రూపకాన్ని ముద్రింప జేయాలనే నా తపన! ఇంకా రూపులు కట్టలేదు.

ఇన్నాళ్ళకి ఊహకు ఊపిరి పోయగల్గినందుకు, నన్ను నేను అభి నందించుకోడంలో అనౌచిత్యం ఏమీలేదు! ఎందుకంటే, ఆంధ్ర మహా కవుల అద్భుత కవితా విజయపతాకాలుగా భువన విజయము, హరిహర సదస్సు, కవన విజయము, సాహిత్య ధర్మాసనము మొదలైన ప్రదర్శన లెన్నో ఆంధ్రదేశంలో అత్యధిక ప్రతిష్ఠను ఆర్జించుకొనిఉన్నాయి.

ఏ ప్రదర్శనంలోనైనా పాల్గొనేవారు పురుషపాత్రలే! మొత్తుక్కుబడికి ఒక స్త్రీపాత్రకు అవకాశం ఇస్తారు.

కానీ ఇది శుద్ధ అన్యాయం అనకతప్పదు. శ్రీ గోపాలరెడ్డిగారు సహృదయులుకాబట్టి, కవయిత్రుల పాత్రలతో ఒక సాహిత్యరూపకం వెలుగులోకి రావాలని, ఆయన ఆకాంక్షించారు!

'సరస్వతీ సామ్రాజ్య వైభవం' అనే మకుటంతో నేను రచించిన ఈ రూపకాన్ని రసజ్ఞులైన ఆంధ్ర ప్రేక్షకలోకం ఆదరిస్తుందనే నా విశ్వాసం!

ముఖ్యంగా ఒక అంశం మీముందు ఉంచాలి! ఇందులో మొల్ల, మధురవాణి, గంగాదేవి, రంగాజీ, వేంగమాంబ, ముద్దుపళని మున్నగువారికే నేను స్థానం కల్పించాను. ఇంకెందఱకైనా ప్రదర్శకులు స్థానం కల్పించుకోవచ్చు. సమస్య, దత్తపది, వర్ణన మున్నగు అంశాలనుకూడా ఎవరి ఉపజ్ఞనుబట్టి వారు కల్పించుకోవచ్చును.

ఇంకో విషయం- ఇదే మకుటంతో ఈ కూర్పులో రెండు రూపకాలున్నాయి - మొదటిదానిలో 1 గంట ప్రయోగానికి సరిపడు వస్తువున్నది- రెండవ రూపకం ఒక అరగంట ప్రయోగాన్నిమాత్రమే ఉద్దేశించి రచింపబడినది - రెండింటియొక్క కావ్యాత్మ ఒక్కటే.

ఇంక తుది అంశం- ఏప్రిల్ 10 వ తేదీనాడు నాకు అనంతపురంలో మాన్యదంపతులు శ్రీ కాసంసెట్టి రాధాకృష్ణయ్య, శకుంతలమ్మగార్లు లలిత కళాపరిషత్ సహాయంతో నాకు కనకాభిషేకం చేసినప్పుడు సాహితీ కళాకల్పద్రుమ బిరుదాంచితులు, ఆధ్యాత్మికౌన్నత్యంతో తాను మాధవుడై తోడివారిని మాధవులనుగా మలచవలెనను మహోన్నతాశయంతో నిరంతర ధార్మికసేవ, సంఘసేవల నొనరించుచున్న మాన్యసోదరులు శ్రీ కె. రాధాకృష్ణయ్యగారు తమ పవిత్ర కరకమలములతో ఆవిష్కరించి, ఈ రూపకానికెంతో ఘనప్రశస్తిని ఆపాదించారు.

ఇట్లా ఈ రూపకం మాన్యులైన ఇద్దరు సోదరుల ప్రేరణ, ఆశీస్సులతో ఆంధ్ర సాహితీ నందనంలో మందారమాలికగా రూపొందించి నందుకు వారికి ధన్యవాదాలర్పిస్తున్నాను.

— ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ



శ్రీ కల్లూరి శకుంతలమ్మ, రాధాకృష్ణయ్య దంపతులు 10-4-88 న
అనంతపురంలో కళాప్రపూర్ణ డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారికి
కనకాభిషేకము చేయుచున్నప్పటి చిత్రము.



శ్రీ కల్లూరి శకుంతలమ్మ, రాధాకృష్ణయ్య ఫౌండేషన్ వారు 10-4-88 న అనంతపురంలో డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారికి లలిత కళాపరిషత్ వారి సహకారంతో కనకాభిషేకం జరిపినప్పుడు సాహితీ కళా కల్పద్రుమ శ్రీ కల్లూరి రాధాకృష్ణయ్యగారు "సరస్వతీ సామ్రాజ్య వైభవ" రూపకమును ఆవిష్కరించుచున్నప్పటి చిత్రము.

ఆచార్య తూమాటి దొణప్ప,
ఎమ్.ఎ.,పి.హెచ్.డి.,డి.లిట్
కులపతి
తెలుగు విశ్వవిద్యాలయం

# తిలకం

సహస్రాబ్దులుగా సాగుతూవచ్చిన ఆంధ్రసాహిత్యక్షేత్రంలో రూపక రచనాకృషి చాల అర్వాచీనం. అందులోనూ అనూదితాలే అత్యధికం. యక్షగానాది దేశీయరూపకాలు మాత్రం పై సూత్రానికి అపవాదం. సముత్సాహ సాలులూ, ప్రజ్ఞాశీలురూ ఐన కొందరు ఆధునికులు చేపట్టిన రచనోద్యమంలో అనిదంపూర్వమూ, ఐదం యుగీనమూ అయిన ఒకానొక దృశ్యకావ్యభేదం అవతరించింది. ఉపరూపకాలలో ఈ నూతన సాహితీమూర్తి ఏరీతికి చెందు తుందో సాహిత్యశాస్త్రకారులు నిర్ధారించవలసి ఉంది. ఇందిరామందిరం, ఇంద్రసభ, కవనవిజయం, కురుపాండవదాయ విభాగం, భువనవిజయం వంటివి ఈ కుదురునకు చెందినవి; అభిజ్ఞశేఖరుల ఆమోదాన్ని, రంగస్థలాభి మానుల ఆదరాన్ని పొందినవి. ఈ కోవకే చెందిన ప్రకృతకృతి 'సరస్వతీ సామ్రాజ్యము' కళాప్రపూర్ణ శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారి విశిష్టసృష్టి.

ఉభయవంశదీపికగా, ఉభయభాషారూపికగా తెలుగునాట ఈమెది పెద్దపేరు. విద్యావినయ వితరణాలలో తండ్రికి తగ్గని తనయ; వ్యవహార పోధృతలో శ్రీ హయగ్రీవగుప్తగారికి తగిన గృహిణి. 'పత్యేవజాయా' అన్న వేదమంత్రార్థానికి ఈమె సమర్థత అక్షరక్షరం అన్వర్థం. ఇదే ఈమె సాహిత్యసత్యవ్రతదీక్షకు రక్షాకవచం. సరస్వతీస్తనద్వయ ఉపమా

ద్రవ్యాలుగా ఉపశ్లోకితాలవుతున్న సంగీతసాహిత్యాలలో ఈమె సహజబోద్ధ; విద్వత్సభాగారాంతరాకల్పిత స్వర్ణస్నానగతి ప్రసిద్ధ. పరమ వివేక సౌరభ విభాసిత సంసత్సంపూజిత; ఆంధ్రవిశ్వకళాపరిషద్దత్త; 'కళాప్రపూర్ణ' బిరుద విరాజిత.

అలనాటి ఆంధ్రకవయిత్రులేకాక, ఆయా కావ్యప్రబంధ భావాంబరవీధీ విశ్రుతవిహారిణులైన కలభాషిణి - 'కలహభాషిణి' అని ఈ కృతిలో ఒక పాత్రయైన కలహాశనని ఉక్తిచమత్కృతి- వంటి పాత్రలు సైతం ప్రధాన పాత్రవహించడం ఈ కావ్య రచనానిర్మితిలోని ప్రత్యేకత. ఇందలి చమత్కార సహితమైన సన్నివేశకల్పనము, చారుతా మహితమైన సంవాదచాతుర్యమూ, సమయోచిత వాకోవాక్యవిన్యాసమూ, పాఠకులనూ, పారిషదులనూ సరిగా, సమంగా అలరింపజేస్తాయి. పఠనభావుకతా, ప్రయోగయోగ్యతా అమరిన ఈ లఘుకృతి శ్రవ్యకావ్యంగానేకాక దృశ్యకావ్యంగా సైతం సామాజిక ప్రవరులను రంజింపజేయగలదు. ప్రయోగకుశలులైన కుశీలవుల అభినయకౌశలానికిది నికషోపలమనడం అత్యుక్తికాదు. ఈ శాఖలో మరిన్ని రచనలు సృష్టించి తెలుగుసాహితికి పరిపుష్టినీ, రసపిపాసువులకు సంతుష్టినీ శ్రీమతి లక్ష్మీకాన్తమ్మగారు కల్పించగలరని ఆశిస్తున్నాను.

"...ఆయుషే వర్చసే బలాయ దీర్ఘాయుత్వాయ శతశారదాయ"

హైదరాబాదు
24-6-88

తూమాటి దోణప్ప

— * —

శ్రీ కన్యక నుద్దేశించిన 'సుప్రభాత' గీతి 'దేవీ స్తవమై తారావళినంటిన దివ్యకవిత - 'లక్ష్మీకాన్తా' సమ్మిత సరసకవిత.

సకల 'కళాప్రపూర్ణ' మైన ఈ కవిత చిరంజీవమై జగత్కల్యాణము సంధింపగలదు.

స్తవముకాదెది పరమ వాస్తవము సుమ్మ!

హైదరాబాద్ వి. వి. యల్ నరసింహారావు
26-6-88



సూత్ర : సరే! మఱి ఈ వినూత్న ప్రయోగమునందు నేను బృహస్పతి పాత్రను ధరించుచున్నాను.

నటి : మఱి నేను కూడ, కలభాషిణి పాత్రను పోషించబోవుచున్నాను.

సూత్ర : సరస్వతీ సామ్రాజ్య వైభవమునందు కలభాషిణి పాత్ర ప్రసక్తి యేమున్నది?

నటి : వాగ్దేవీ సంసద్భవనమునందే పాత్రకు ప్రవేశము ఉండరాదు। అయినను అమరగురువులు మఱచినట్లున్నారు! కలభాషిణి పూర్వజన్మమున సరస్వతీ మహాదేవియొక్క ముంజేతి రాచిలుక కాదా?

సూత్ర : ఔనౌను. మఱచితిని _ నీ పాత్రధారణ ఉచితమైనదే।

నటి : ఇంక మనము త్వరగా లోనికి పోవలసి యున్నది. ఆహార్యమును అమర్చుకొనవలెను కదా! [రాగయుక్తముగా] మేల్ముసుగు సవరించి, మేఖలను ధరియించి_

సూత్ర : మఱి, నేనో....

నటి : ఏమున్నది? "హోంబట్టు శాలువయు"___

సూత్ర : [ఆమె పాట కనుగుణముగా శాలువ కప్పుకొనుట మున్నగునవి అభినయించును.]

(తెర యెత్తగానే)

[సరస్వతీదేవి కొలువున మొల్ల, మధురవాణి, గంగాదేవి, రంగాజీ ముద్దుపళని, తిమ్మక్క, తరిగొండ, వెంగమాంబ, కనుపర్తి వరలక్ష్మమ్మ, చానమ్మ మున్నగువారు ఆసనములను అధిష్ఠించి యుందురు:—]

సరస్వతీ ఆగమనమును తెలుపు వందిమాగధుల భద్రవినాదము లీ క్రింది విధముగా వినబడును:—

"అఖిల సృష్టి ప్రణవోద్భాసినీ, భద్రమస్తుతే
త్రైలోక్య పరీవ్యాప్త సకలాగమ నిగమ విద్యాకళా
స్మిత భాసినీ వందనమస్తుతే
భారత భారతీ శుభవాఙ్మయ కళాధిష్ఠాత్రీ
స్వాగత మస్తుతే
సర్వవర్ణ పదవాక్యార్థ స్వరూపిణీ, అనాది
నిధనా పాతున స్సరస్వతీ
త్రిభువన సమస్తప్రాణి జిహ్వాసింహాసనాధి
నేత్రీ స్వాగతమస్తుతే

[ఈ వినాదములైన వెనుక సురగురుడైన బృహస్పతి యీ క్రింది శ్లోకముతో]

అనాదివో బృహతః పర్వతాదా
సరస్వతీ యజతాగంతు, యజ్ఞం
హవం దేవీ, జుజుషాణా, ఘృతాచీ
శగ్మాం నోవాచ ఉశతీ శృణోతు॥

ప్రోల : భోజనమేల పెట్టలేదు? సుగురూ! నా కడుపున బుట్టి, పరాజితుడై యింటికి వచ్చినాడు వాడు! వీరమాతకు ఇంతకన్న పరాభవమేమున్నది? అదియే మఱియొక దైనసెంతో, నా ఆత్మజుడైనను అంతే కదా! కాకున్న కన్నతల్లి ని కమక, కడుపు చుమ్మలు చుట్టుకొనిపోవుచున్నను, కడుపునిండ తిననిచ్చి కడకు విరిగిన పాలుపోసితిని.

కల : మంచిపని చేసితివి! అపుడేమైనది ప్రోలమాంబా?

బృహ : ఏమగును? ఈ విపరీతమేమని నివ్వెరబోయిన కన్నకుమారు నుద్దేశించి....

ప్రోల : నేను ఈ విధముగా బుద్ధి గఱపితిని:-

అసదృశముగ పరివీరుల
పసమీరగ గెలువలేక పందక్రియన్నీ
వసివైచి తిరిగి వచ్చిన
పసులున్ విరిగినవి తిక్క! పాలున్ విరిగెన్!!

బృహ : ఔనౌను నిష్కళంక దేశభక్తురాండ్రైన మీ అత్తకోడండ్ర చిత్తశుద్ధి అంత అకలింతమైనది కూడ. ఇంతకును ఖడ్గ తిక్కన ఏడమ్మా?

కల : ఇంకెక్కడి ఖడ్గ తిక్కన! వీరిద్దఱి ధాటికిని తట్టుకొనలేక కాటమరాజుతో తలపడుటకై, తలపట్టుకొని మరల బలమును సమీకరించుకొనుటకై భూలోకమున కేగినట్లున్నది

బృహ : సరియే! ఇప్పటికీ ముచ్చటముగిసినది. వాగ్దేవీ సంస్తవముతో
అసలు కథ కుపక్రమింతము.

యాం విరత్వాఖిల బంధం
నిర్మథ్యాఖిల వర్త్మనా యోగీ
యాతి పరం స్థానం
సామాంపాతు సరస్వతీ॥
(సరస్వతీ రహస్యోపనిషత్తు)
[అని సరస్వతిని స్తుతించును]

చదువుల తల్లీ, నీ చల్లని చూపు లెవరిపై ప్రసరించునో వారెల్లరు రసరాజ్యాభిషిక్తులై తమ మహనీయ కావ్యానుశాసనమున, శివేతరక్షతి కల్గించి అనంత సృష్టిని అవ్యాహతానంద ముద్రాంకిత మొనర్చి, త్రికాలా వచ్ఛిన్నముగా ఏల్బడి సాగించుచున్నారమ్మా, అట్టి రసరాజ్ఞులలో కమనీయ కావ్యాత్మతో, రమణీయ, రసమయ కవితా శిల్పాకృతులకు జీవముపోసిన కొందరాంధ్ర కవయిత్రులు నిన్ను కొలువనేతెంచిరి. జగదంబా! నీ యాజ్ఞయైనచో ఈ కవయిత్రీమణులెల్లరు, ఆంధ్ర సాహిత్యోద్యానమున తాము విరియించిన మనోజ్ఞ కవితా సురభిళ ప్రసూనములతో, నిన్నర్చించి రవంత తడవు నిన్నలరింతురు.

సర : అవశ్యంభావ్యమైన అంశమిది. అమరాచార్యా! నాకును ఆహ్లాదకరమై పరమాదరణీయమైన సంవిధానమిది! నేల నాల్గు చెఱగులకు తమ కవిత్వామృతమును, నెఱచూఱలిచ్చి, జగతీ జనులకానందము పంచియిచ్చిన యీ కవయిత్రీ

మణుల కవితా మాధుర్యము చవిజూడవలెనని ఆకాంక్షగనే యున్నది.

(తెరలోపలనుండి వీణానాదము విన్పించును)

వార : (రంగస్థలి ప్రవేశించి)

ఏమి ఈ యద్భుతము? అసంకల్పిత ప్రమోదావహమైన శారదా దేవి నిండోలగమున నుండి త్రైలోక్య శ్రేయస్సంవిధానమునకు రూప కల్పన మొనరించుచున్నట్లున్నదే! (సభ యంతయు పరికించి) ఓహో! ఏమి యీ సరస్వతీ సామ్రాజ్య వైభవ ప్రాభవము? ఈ దృశ్యము తిల కించు మహాభాగ్యము నాకు లభించినందులకు ఎంతేయో ముదమొందు చున్నాను.

అమరగురూ! సరస్వతీదేవియొక్క పవిత్రమైన ఈ పేరోలగము చూచినంతనే నేను శారదా సంస్తవ మొనర్చుటకు ఉత్సహించు చున్నాను.

సదమల ప్రాజ్య విజ్ఞాన సామ్రాజ్య సం
గ్రహమైన గ్రంధ ప్రవ్రజమ్ముతోడ
సుమనో మనోహర సుసహితా క్షరమాలఁ
బురిణించు స్ఫటికాక్ష సరముతోడఁ
గౌటిల్య జాటిల్య పాటవ మొనయని
కలికి పల్కుల రామచిలుకతోడ
సర్వాభిలషణీయ సత్యరేఖాదికా
సంస్ఫూర్తిమత్పరో జమ్ముతోడ

సరస సంగీత సాహిత్య సంపుటస్త
సస్వనద్వల్లకీ శ్రుతినందితముగ
జగతి నాశీర్వదించు విన్ బొగడదరమె!
తల్లి వాగ్దేవతా దేవతావు తల్లి!

బృహ : దేవమౌనీ, సమయమునకు ఈ సభకు విచ్చేయుటయే గాక మనోజ్ఞముగ సరస్వతీస్తవ మొనరించి ఈ సభా శోభను మరింత అతిశయింప జేసితిరి.

నార : ధన్యోస్మి! సురగురూ! ఇక పోయివత్తునా!!

బృహ : శుభమస్తు (సరస్వతీదేవి నుద్దేశించి) తల్లీ! కవయిత్రీ మణుల కవితా మాధుర్యమును చవిజూడవలెనంటిరిగదా! ఇక మీ యాజ్ఞ పాలింతునా!

ధర్మనిగ్రహుడైన శ్రీరాముని మనసార స్మరించి రామాయణ కావ్యరచన మొనర్చి పవిత్రురాలైన మొల్లమాంబ ముందుగా జగదంబను సంస్తవ మొనర్చును!

మొల్ల : [లేచి నిలువబడి పూవులు తీసికొని, చేతులు జోడించి] ధన్యురాలను తల్లీ! ధన్యురాలను. ఉపనిషదుద్యాన కల కంఠియు, త్రిజగతీ విద్యాధిష్ఠాత్రియు, విజ్ఞాన కల్పవల్లియు, అఖిల భూతాంతర్గత చైతన్యాకృతియునైన వాగ్దేవి మా కవితా మాధుర్యమును చవిజూడనెంచుట మా భాగ్యము. శంకర

సరస్వతీ సామ్రాజ్య వైభవము

భగవత్పాదుల విరచితమైన సంస్కృత శ్లోకముతో తొలు దొల్తగా సరస్వతీ స్తవ మొనర్చెదను.

కల : కవయత్రీమతల్లీ! శంకర భగవత్పాదులు నీ కెంత మేలొనర్చినారమ్మా!

మొల్ల : తలభాషిణీ! నీవంతలోనె తొందరపడెద వేమమ్మా! అటు లైన సరస్వతీ స్తవము నావిరచితమైన సంస్కృత శ్లోకముతోనే చేసెదను గాక!

బ్రహ్మణీం, సుకలాం, పరాం పరబ్రహ్మ స్వరూపిణీం
సురజ్యేష్ఠ ప్రియాం, భక్త సులభామ్ సురవందితాం
వీణామంజుల పాణిపల్లవ యుగళభాసితాం
వందే జగద్వందితాం, శారదాం గిరాం దేవతాం

బృహ : మొల్లమాంబా! భక్తి రసపూరితమైన నీ రామాయణ కావ్యమునుండి కూడ ఒక పద్యమును విన్పింపుము!

మొల్ల : అవశ్యము! గురూత్తమా!

సరస్వతీ సామ్రాజ్య వైభవము

మేలిమి మంచుకొండ నుపమింపగ జాలినయంచ నెక్కి, నా
హ్యాళి, నటించి, వచ్చు. చతురాస్యునెదుర్కొని నవ్వుదేరగా
వాలిక సోగకన్నుల, నివాళి యొనర్చి ముదంబు గూర్చు వి
ద్యాలయ రాణి, శబ్దముల, నర్థములన్ సతతంబు మాకిడున్

(పద్యము చదివి ప్రసూనాంజలిని వాగ్దేవికి సమర్పించును)

బృహ : సెహబాస్! బాగుగా కూర్చితివి. సరస్వతీ స్తవ రూపమైన నీ కవితా మల్లికా ప్రసూనదామము భక్తిరస నిష్యందియై. చదువులరాణి పద పద్మములనుండి స్రవించు మరంద వాహినిగా మాధుర్యములు నించుచున్న దమ్మా!!

కల : ఇది యేమి సురగురూ! మొల్లమాంబా కవితా ప్రస్తుతి చేయ వలసిన ధర్మము నాయందున్నది. మీరేల త్వరపడితిరి?

బృహ : విడ్డూరముగ మాట్లాడెదమేమి కలభాషిణీ? సానలు దీరిన జాతిరత్నమువలె సౌందర్యము వెదజల్లు కవిత వినగనే ప్రశంసించుటలో త్వరపడుట యేమున్నది?

కల : అది కాదు గురూత్తమా! మొల్ల నధిక్షేపించినది నేను కదా! మరి యింత సొంపైన కవిత నల్లినందుకు ముందుగా ప్రస్తుతింప వలసిన బాధ్యత నాదే కదా!

బృహ : నీవును ప్రశంసింపుము! కాదనున దేమున్నది?

కల : ఇంక పునరుక్తి యెందులకు లెండు!

బృహ : గంగాదేవీ, కంపరాయల కదన పాండితిని క్రమరీతిని మధురా విజయ గాధగా, పోహళించిన నైపుణి, నీ సొమ్ము! అగమ విపిన మయూరియా ఈ జగజ్జనని నెట్లలరింతువో!

గంగ : దేవ గురూ, గీర్వాణ సుమమాలతో ఈ గైర్వాణికి ముందుగా గ్రైవేయక మర్పింతునా?

కల : అయ్యో, దానికింత అభ్యర్థన మేలనమ్మా. ఇది సకల భాషాధిష్ఠాత్రియగు శారదా విద్యాపీఠము! గురుపీఠ మధిష్ఠించిన ఆద్య బాషను శారదాస్తవ మొనరింతుననిన, నిన్ను గురు పాదులు వలదందురా?

గంగ : "అంతర్యామ్యాత్మనా, విశ్వం త్రైలోక్యం, యా నియచ్ఛతి రుద్రాదిత్యాది రూపస్థా, యా మా మావేశ్యతాం పునః ధ్యాయంతే, సర్వరూపైకా, సామాంపాతు సరస్వతీ"!
(సరస్వతీ రహస్యోపనిషత్తు)

బృహ : ఓహో! గంగా నీవు త్రిపదవు కదా, ఆ ఛందము ననుసరించి అందముగా సరస్వతీ రహస్యోపనిషత్తు నందలి, త్రిపదీ స్తోత్రము నెన్నుకొంటివి!

కల : గంగాదేవీ, తెల్లని నుడికారములు జాజులవలె దిశలెల్ల పరిమళములను ఘుమ్మని, ప్రసరించుచున్నట్లుగా తల్లికి, ఆంధ్రిపై కొలువర్పింప వమ్మా!

గంగ : కలభాషిణీ నీ తియ్యని యూహకు ఊపిరి పోయుటకై యత్నించెదను—

ప్రకట మహార్ధ భావరసభాసుర కావ్యచయంబు సారస
ప్రకరముగా ధరించి మధురధ్వని సంభరిత ప్రసిద్ధ నా
టక నిచయమ్ము సొంపగు కడాని హారంగుల
విగ్గులొల్క చం
పక సుమరాజిగా ముడుచు భారతి కంజలి గూర్తు
నిచ్చటన్॥

బృహ : గంగాదేవీ. సాధు, సాధు, కలభాషిణి యభ్యర్థించినందున కాబోలు, కలకండలు గ్రుమ్మరించితివి!

కల : ఇది యేమి సురగురూ! నేనడిగితినని, కలకండలచ్చులు పోసినదా? మీరు ఆదేశించినను అట్లే యుండును. గంగా నిర్ఝర ప్రవాహమునకు ఈ ముల్లోకములం దెక్కడనైనను, స్వచ్ఛతా సౌందర్యములు కొఱవడినవా?

బృహ : కలభాషిణీ, నీతో ఏమిమాట్లాడినను, ముప్పువచ్చుచునేయున్నది- మొల్లను నేను ప్రశంసింపగా అది నీ కర్తవ్యమంటివి గదా యని ఇది నీ ప్రేరణ యంటిని. అమ్మా, నీవు నిజముగా కలహభాషిణివి!

కల : భళి, భళీ, ఎంత చక్కని బిరుదు నిచ్చితిరి! ఒక్కమాఱుగా, నాకు దేవమౌనియంత స్థాయి పెరిగిపోయినది. కాని - దేవగురూ, ఈ బిరుదును, నాపట్ల యింకను సార్థకపఱుప వలె ననిన,

బృహ : ఊఁ- సార్థక పరుపవలెననిన ___

కల : "కలహాస భాషిణి" యనవలెను.

ప్రోల : ఎంతోచమత్కారముగ మాట్లాడితివి .... కానీ - ఆ అర్థమున అది....

మధు : సరిపోవును లెమ్ము-

సర : భేష్, ఎంత వాఙ్నైపుణి యబ్బినదే - కలభాషిణీ నీకు?

బృహ : మధురవాణీ! మధురాంధ్రము మానసీయమను శ్లాఘ యొక్కమ్మడి చెలరేగవలెనమ్మా!

మధు : గురుసత్తమా - అవధరింపుడు.

జననీ! నీకరుణా కటాక్ష విలసత్సౌ భాగ్య సంపత్తిచే
ఘన విజ్ఞాన కళా ప్రపంచ విభవోత్కర్షమ్ము హర్షమ్ముగూ
ర్పః! నవోత్తేజముగల్గుచిత్తమునసంప్రార్థింతుయుష్మద్దయాం
బునిధిన్ మున్గుమదేలు భాగ్యమిడుమా!పూర్ణానురాగమ్ముగన్!

సురగురూ! ఆద్యవాణిని అందముగా, శిల్ప సుందరముగా
పేర్చి వాణీ మహాదేవికి నా గైర్వాణీ ప్రసూనాంజలిని
సమర్పింతునా?

బృహ : అట్లే కానిమ్ము తల్లీ!

మధు : వీణాధరే విపుల మంగళ గాన శీలే
భక్తార్తి హారిణి, విరించి హరీశ వంద్యే
కీర్తి ప్రదేఽఖిల మనోరథదే. మహార్హే
విద్యాప్రదాయిని, సరస్వతి నౌమి నిత్యం!!

కల : [నోటిపై వ్రేలుంచుకొని సలీలముగా చూచుచుండును]

ముద్దు : అదేమమ్మా కలభాషిణీ నీవిట్లు నోటిపై వ్రేలుంచుకొని, ఉలుకక, పలుకక యున్నావు? గలగల పాఱు సెలయేరువలె నీవు కలభాషలతో పలుకక యున్న, ఈ సభ యెంతయు కళ దప్పి చిన్నబోయిన దమ్మా!

కల : నేనే మన్నను సురగురువులు కస్సు - బుస్సు మను చున్నారు?

బృహ : కలభాషిణీ, నీతో నాకు కయ్యమెందులకమ్మా! నీవు పసి కూనవు! నేనేమి చెప్పినను, నెయ్యముతోడనే, "బిడ్డా!" - నీవు యధేచ్ఛగా నుండుము. శారదాదేవి కాలియందెల మెత్తని ఘలంఘలలు సరిక్రొత్త శ్రుతులతో ఆనంద గీతికలను అల్లెనా యనునట్లు, తిమ్మక్కా- నీవు భారతిని కీర్తింపవమ్మా.

కల : ఔనౌను, తిమ్మక్కా-

అక్కజమగు కవితలతో
చొక్కంబౌ తెల్గు శోభ చూపగదమ్మా.

విశ్వాసుం : ఓహో, కలబాషిణి కూడ, కవయిత్రియై పోయినదే?

కల : ఓహో, సహవాస దోషము ఎంతైన చేయును.

మొల్ల : ఈ కవితా వ్యాసంగమును, సహవాస దోషముగా, భావించు చున్నావా? సురగురూ వింటిరే!

బృహ : ఆహో, వినుచునే యున్నాను-మటల నా వ్యాఖ్యాన మెందు లకు లెమ్ము!

తిమ్మ : తల్లీ, శారదా!
చతుర కవిత్వ రమ్యరస సాగర పారగులౌ కవీంద్రులే
సతిపదకంజయుగ్మమున చంచల భక్తి భజించి గొప్ప కీ

రీతి గనినారలాయమ విరించె ముఖమ్ముల నిల్చి దేని నే
సతతము గొల్చుచుండెదను స్వాదు కవిత్వ మహత్వ
సిద్ధికై ॥

బృహ : నే ననుకొనునట్లే, తిమ్మక్క జానుతెనుగు పస జాలువారు నట్లు వీనులకు విందుగ కవిత సెప్పినది. ముద్దు పల్కుల నళినియగు ముద్దు పళని సుద్దుల నాలకింపవలెనని, నా మనస్సువ్విళ్ళూరు చున్నది.

ముద్దు : అమరాచార్యా, ఆలింపుడు.
లలితాత్యంత మనోజ్ఞ శబ్దయుతముల్ శయ్యాతి రమ్యం
బులున్
విలసన్మంజుల భావశోభితములై వెల్గొందు కావ్యాళిని
చ్చలు నేతల్లి కటాక్షముల్ వెలిగి సంప్రాప్తమ్మగున్
జెప్ప నా
పలుకుం దొయ్యలి కెల్ల వేళల నమోవాకమ్ము లర్పించెదన్॥

బృహ : లెస్స బల్కితివి పళనీ! లెస్స బల్కితివి! రంగాజీ పొంగులు వారగా నీ హృదయ తరంగణినుండి, ఒక స్తుతి తరంగ మువ్వెత్తుగ లేచి వాగ్దేవి పాదాభిషేక మొనరింప నుత్స హించు చున్నాము.

రంగా : సురగురూ! ముందొక్క సంస్కృత శ్లోకమున పల్కుల రాణిని త్రిమూర్త్యాకృతితో స్తుతింప ననుమతి గోరెదను!

బృహ : అట్లే కానిమ్ము?

రంగా : యా చాందీకృత సర్వలోకసుషమా స్థాణ్వర్ధ కాయాసతిః
యా యోగీశ హృదమ్మకీ, హరి హృదబ్జాలంక్రియా
శ్రీ సతిః
యా సాహిత్య రసాకృతిర్విధి ముఖాసీనా శుచిర్వ్యాకృతిః
త్రైలోక్యాభరణా త్రిమూర్తి లలితా సాపాతు
వాణ్యంబికా॥

కల : నిలింపగురువులు ఉపశ్రుతి పల్కినట్లుగా రంగాజీ కవితా రంగము రంగుల హరివిల్లునే రంగరించినది. ఎంత కమ్మని కవిత్వ సుధలను చిలకించితివమ్మా – రంగాజీ! తెలుగున కూడ నొక పద్యమును చెప్పుము.

రంగా : కలిగినవారి కొక్కరికె కాక భయంకర యుద్ధభూమిలో
నలిగెడి వారికిన్ మహదనన్త మనోజ్ఞ పవిత్ర భావనల్
కలిగెడి లీల నీ కరుణ గంగగ పొంగును తారతమ్యముల్
కలుగని సుప్రసన్న నవకావ్య కళా మహితాత్మ శారదా!

బృహ : పద్య విద్యా రహస్యము తెలిసిన నీ కవిత ఎల్లపుడును ప్రశంస్యమే–ఇంక–ఈః–!

కల : ఇదేమి గురువర్యా? "ఇంక–ఈః" అనుచున్నారు? మా తల్లిని కొనియాడు శుభావకాశమును ముగించు చున్నట్లున్నదే!

తక్కిన కవయిత్రులా భాగ్యమునకు నోచుకొనలేదా? మఱి నా మాట యేమి చేసితిరి?

బృహ : కలభాషిణీ! నీ ముచ్చట కాదనగలనా? ఉదాత్త రసభావ పద బంధమైన, నీ యెడదను - పదిల పఱచి, చదువుల తల్లి పదముల కడ ఉపదగా నిమ్ము! తక్కిన కవయిత్రుల కింకొక విధముగ ఆ యవకాశము ఈయబడును.

కల : మీ రిపుడు సెలవిచ్చినది బాగున్నది. భక్తి ప్రసూన సంభరితమైన దోయిలితో నా తల్లికి కైమోడ్పు లర్పింప వలెనను ఉబలాటమే కాని, నేనేమి కవయిత్రినా?-శిల్ప సౌందర్యములు వెల్లివిరియింప జేయుటకు! ఐనను నాతల్లి పూజయేకదా! నేర్చిన కొలదిగ కవితా కుసుమములను సేకరింతును.

వాణీ, జ్ఞానమయే పరే వర విపంచీ నా ద సమ్మోదితే
వాత్సల్యాంచిత వాక్సుధాలహరి కా సంపుష్ట భక్తౌఘకే
వాల్యభ్యా దృత సృష్టి కార్య విముఖత్ సద్యోద్ధితే,
వాక్ప్రి దే
వారాహ్యాది నిషేవితా లలిత విద్యే శ్రీ ర్న మస్తే
నమః

~~(సరస్వతీ రహస్యోపనిషత్తు)~~

సురగురూ! ఆంధ్ర ధారత భారతీ ప్రాగల్భ్యే మొప్పగా ఇంకొ స్తుతి నొనర్చెదను.

వేదాంత తత్వార్థ విజ్ఞాన రూపమై
భాసిల్లు నేతల్లి పదము జంట
ప్రణవార్థ సంస్మర శ్రవణమై నినదించి
శబ్దించు నే తల్లి స్వాదు జిహ్వ
ఉపనిషదటవీ మయూరియై సతతమ్మ
న ర్తించు నేతల్లి జ్ఞాన వీధి
కరపద్మ భాసిత కచ్ఛ పీ గాన వి
లోలయై యే తల్లి యోలలాడు?
భాసమాన ప్రత్యేక జిహ్వానన యయి
సకల ప్రకృతి జీవద్వాణి సంస్థ యెవరు?
సర్వహృద్రస వాహియా సంవిదాత్మ
భారతీమూర్తి నాతల్లి ప్రస్తుతింతు!

అందరు : భళి భళి! ఏమి ఉదాత్త కల్పన? ఏమిగంభీర శిల్పము!!?

బృహ : అప్పుడే విరిసిన బొండు మల్లియలు నెలవినార నవ్వినట్లు మెఱపులు గుంపులై యేతెంచి వెలుగులు వెదజల్లినట్లు. కలభాషిణీ! నీ కల్పనము విశదమై, విజ్ఞానాత్మకమై, పరమార్థ తత్వ ప్రాహిణీయయగు శారదామహాదేవి విశ్వతోరూపమును. గంభీర తత్వమును, కలవై ఖరిని వర్ణించినది. అందుకే-పలుకుల తల్లి నీకు "కలభాషిణి" అని పేరిడినది.

(వినమ్రాంజలియై పుష్పాంజలిని సరస్వతి పదములకడ నుంచును)

బృహ : మొల్లమాంబా! నీవొక సమస్యను పూరింపవలెనమ్మా!

మొల్ల : ఏమది? సెలవిండు!

కల : ఆచార్య వర్యా! ఈ మహా కవయిత్రికి సమస్య నిచ్చుట ఏమి యందము? ఆమె నడుగవలసిన విధానము నేను సిద్ధపఱచి యుంటిని.

బృహ : సరే! నీవే అడుగుము!

కల : దేవ భాషను నీ యిష్టదైవమును వర్ణింపుము!

మొల్ల : లోకరక్షణ ధర్మ మోహన రూప విభ్రమ తేజసా
యో ఒ కరోదిహ రాజ్యమాతత రామరాజ్య మనామయమ్
తం పరంజన రంజకం, ఖల రావణాసుర భంజకం
జానకీ విభుమాశ్రయే భువి రామరాజ్యమనుస్మరన్!

ముగ్ధ : మహా కవయిత్రీ! నీ ప్రజ్ఞకు తగినట్టి ఉత్తమ కవితా శిల్ప కృతిని శ్రీరామచంద్రుని మలచి నిల్పితివి.

బృహ : చదువుల తల్లి ఉత్సుకత చూపుచున్నారు. వేంగమాంబ కేమైన సమస్య చెప్పెదరా? (వేంగమాంబ ధ్యాన నిమగ్నమై యుండును)

సర : వేంగమాంబకు సమస్య యెందులకు! తల్లీ! వేంగమాంబా!

వేంగ : (ధ్యానములోనుండి కనులు తెఱచి) ఆ! ఏమంటిరి!

సర : నీ యిష్టదైవమును స్మరింపుము?

వేంగ : అవశ్యము! ఆలింపుడు!

బహుళార్ధ సాధక బ్రహ్మాండ ఖాండంబు
పాలనా స్థితి సల్పు ప్రభుడెవండు?
దివ్య వక్షమ్మునా దేవి లక్ష్మికి నిచ్చి
మహిళ కున్నతి గూర్చు మహితుడెవడు?
శ్రీరామ కృష్ణాది చిన్మూర్తి తానయి
ధర్మోద్ధరణ సల్పె ధరణి నెవడు?
దుష్టశక్తుల మాపి దురితమ్ము తొలగింప
గీత బోధించు సుకృతి యెవండు?

శాంతిని, నహింస, ప్రేమను, సత్య నిష్ఠ
భువి, నిలుపగాంధి యౌ మహాత్ముడెవడు
అట్టి శ్రీ వేంకటేశు సమర్చ జేసి
భక్తి తరియింపరే కలి ప్రజలు మీరు!

బృహ : అమ్మా! వేంగమాంబా! నీ వేంకటేశ్వర మహాత్మ్యమునందలి పద్యము నొక్కటి విన్పింతువా?

వేంగ : అట్లే సురగురూ! వరాహావతారుడైన శ్రీ మహావిష్ణువకును గరుత్మంతునకును జరిగిన సంభాషణమును విన్పింతుము.

ధారుణి నీటన్ మునిగిన
కారణమున దాని నెత్తు కార్యంబున నీ
ఘోరాకారము దాల్చితి
నా రూపము చూచి లచ్చినగదె ఖగేంద్రా!

ఆ వైకుంఠ పురమ్మున
కేవిధమున వత్తు లక్ష్మి యెక సక్కెముగా
నీ వెవ్వడనుచు నడిగిన
శ్రీ విష్ణుండనగ నాకు సిగ్గగు గరుడా!

బృహ : ముద్దు పళనీ! ఈ సమస్యను పూరింపుము :-
"సానిన్ పూజలొనర్ప దక్కును-మహైశ్వర్యమ్ము నిక్కమ్ముగా!"

ముద్దు : ఇది యేమి సురగురూ-సాని పూజచే ఐశ్వర్యంబు వచ్చునా! సరియే, పూరింతును వినుడు___,

తేనెన్ జుట్టినరీతి నీ యశము గీర్తింపన్ బ్రయత్నించి, నీ
దానిన్ నన్ను కటాక్ష వీక్షములనుద్ధారింప రమ్మంచనం
తానందమ్మున భక్తిమీర నమితోత్సాహంబుతో శ్రీనివా
సానిన్ పూజలొనర్ప దక్కను మహైశ్వర్యమ్ము
నిక్కమ్ముగా॥

కల : ముద్దు పళనీ బాగు-బాగు కాని పళనీ, నీ కావ్యగత మధుర శృంగారము మాట యేమి?

ముద్దు : "అది రాధా-మాధవ" పరమైనది కదా! అందనౌచిత్యము లేదు!

వర : నేనట్లు తలంచుట లేదు, కలభాషిణీ, పురుషులెట్లును, కొందఱు మాత్రమే సుమీ! లజ్జ విడిచి, అసభ్య శృంగారమును కావ్యముల కెక్కించి ఊరేగించిరి. సిగ్గు సింగారముగా నుండదగిన స్త్రీలు కూడా అట్టిరచనలనే చేసినచో, నింక ఆదికవి, నన్నయ భట్టారకుడు ఉపలక్షించినట్లు కావ్యములు విశ్వశ్రేయస్కరము లెట్లగును? భూలోకమున, నిప్పటి జనుల విపరీత ప్రవర్తనకు, స్త్రీలయెడ కావించు అత్యాచారములకు నిట్టి రచనములే కారణము కాదా?

ప్రోల : ఇట్టి రచనలే ఇప్పటి ఉన్మాద ప్రవర్తనకు కారణమగుట నిజమే కావచ్చును, కాని ఇట్టి కావ్యములు సామాన్య జనుల

కర్థము కాని భాష యందున్నవి. అది కొంతమేలు! కాని ఈ నాడు వ్యావహారిక భాషలో విచ్చలవిడి సంఘటనలతో కుప్పలు తిప్పలుగా వెలువడుచున్న కథానికా, నవలా, సినిమా, రేడియో సాహిత్యము పూర్తిగా దీనికి కారణము.

చాన : నిజమే! రచనమును కూడా ధనార్జనకి ఉపయోగించుటచే నేటి సంఘమున ఇట్టి ఉత్పాతములు ఉత్పతిల్లుచున్నవి.

బృహ : ఐనచో వరలక్ష్మమ్మా! "ఛలము-ఫలము – చలము-స్థలము" అను పదము లుపయోగించి భారత వీరముగా నేటి యువత కొక సందేశమిమ్ము.

వర : దాని కభ్యంతరమేమి? అమరగురూ! అదియే నా ఆశయము కూడ.

ఛలమున జూదము గెలిచియు
ఫలమేగతి బడసితీవు పాపీ శకునీ
చలమున జీవించితి మహి
స్థలమే లేదయ్యె నీకు సజ్జనులందున్!

శల : వరలక్ష్మమ్మా! ఈ విషయముపై నీ కెంత దృఢమగు నభిప్రాయములు కలవో. నీ చెప్పిన తీరున వ్యక్తమగు చున్న వమ్మా. చాల స్పష్టముగా చెప్పితివి.

బృహ : నేనును అట్లే అభిప్రాయపడుచున్నాను. విశ్వసుందరమ్మా! దేశ భాషలందు, లెస్సయగు తెలుగు బాషను, వాఙ్మయమును, గేయ కవితను, కీర్తింపవమ్మా!

వర : మనసాహితి - మధుభారతి
తెలుగుజాతి - ఘనకరీతి
తెలుగన్నను - వెలుగన్నను
ఒకటేయని - ప్రకటించిరి
మనవారలు - పెరవారలు
తెలుగన్నను - తేనెయనిన
తియ్యదనము - తియ్యదనము
తెలుగన్నను - తెలివియనిన
తిన్నదనము - మిన్నదనము
తెలుగన్నను - దీప్తియనెడు
కీర్తిగనిరి - ఘనులందఱు
మధురాంధ్రము - మహనీయము
మాధుర్యపు సారధ్యము
మనబాషకె - మనబాషకె
మాధుర్యపు - టాధ్వర్యము
మనవారిదె - మనవారిదె!

బృహ : తెలుగునే విస్మరించుచున్న ఈ నాటి తెలుగుజాతికి చక్కని తెలుగు సౌందర్యమును విరియించు కవితజెప్పి ఈ నాటి ఆంగ్ల భాషకు బానిసలైనవారికి, కనువిప్పు కల్గించితివమ్మా!

కల : గురుసత్తమా! ఇది యేదో [అర్థోక్తిలో ఆగిపోవును]

బృహ : ఆఁ! పూర్తిగా చెప్పుము. అర్థోక్తిలో ఆగిపోయితివేమి?

కల : ఆఁ!....ఏమియును లేదు – తుదకు ఇది ప్రచార సాహిత్య ప్రక్రియా సాధనముగా అంతమగునా యేమి? అని తలంచుచున్నాను.

వర : భయమెందులకమ్మా! అదియును సాహిత్యమే–అంతేకాదు! దానికున్న విలువ మహత్వ పూర్ణమైనది కదా!

బృహ : ఔను – సరిగా చెప్పితివి వరలక్ష్మమ్మా! కలభాషిణీ! నీవు కలవర పడనవసరము లేదు. ఇదిగో మధురవాణికి ఈ సమస్య నిచ్చుచున్నాను.

"సింహము లొంగెను చిఱుతకు చిత్రము కాదే"

మధు : ఏమిది సురగురూ! చిఱుతకు – అనగా – చిఱుత పులికి సింహములొంగు వెచ్చటనైన గాంచితిమే?....ఐనను, మీ

ఆజ్ఞ దుర్విలంఘ్యము కదా! అట్లే పూరించుచున్నాను.

రంహమున, గూల్చి యసుర, నృ
సింహుం డుగ్రత విడువఁడు చిఱుతండయ్యున్
రంహము ప్రహ్లాదు డఁడిపె
సింహము లొంగెను చిఱుతకు చిత్రము కాదే!

బృహ : ఎంత బాగుగా పూరించితివి మధుర వాణీ - చక్కని ఊహా పద్ధతి, చిక్కని శైలీ విన్యాసము! అట్లుండవలె కవితయనిన! గంగాదేవీ! ఈ నాటి సరస్వతీ సామ్రాజ్య కవితా వైభవమును వర్ణింపుమమ్మా!

గంగ : సరిగా ఇదే భావన నాకు కల్గినది. ఇంతలో మీరు సెలవిచ్చితిరి.

తెలుగుల కవితా సరసిని
మొలచిన రమ్యారవింద ముకుళములనగా
వెలసెను కవయిత్రుల, కవి
తలవియు, వకలంక భావతరళము లొచుచున్ !!

బృహ : అహ-ఈ సభావైభవమునకు దగిన ప్రాభవ కల్పన:- చాలమ్మా! ఈ అంశముపైననే, నీవు నీ భావములను ప్రోది చేయుము!

చాన : అస్లే అమరాచార్యా!

నీరజగత భ్రమర ఝం
కారములొలసెను మరుగతి గగనము నిండన్

కల : [నగములో అందుకొని]

శారద వీణా నా దాం
కారములు సెలగె మృదుతర గంభీర గతిన్!!

బృహ : } అద్భుతము! అద్భుతము! కలభాషిణి కల్పన లద్భు
కవయిత్రులందరు } తము!!!

సర : అమరాచార్యా, మిమ్ము పరీక్షించుటకు కాదుగానీ, మీ అద్భుత ప్రజ్ఞా పాండిత్యములు లోకమునకు తెలియుటకై, మీకు నే నొక చిన్న సమస్య నిచ్చుచున్నాను. పూరింపుడు.

బృహ : అవశ్యముగా పూరించెదను తల్లీ! సెలవిండు.

సర : "శశకేన హతశ్శివః"

కల ; తల్లీ! నిలింప గురువులను ఎంతఇరుకున పెట్టితిరి? ఆచార్యా ఆలోచింపవలసినదే.

చాన : కలభాషిణీ! బృహస్పతులు సకల విద్యా పారంగతులు, వారి

మేరలు తెలియక నీవు కలవరపడుచున్నావు. వారికిది యొక పరీక్షయా?

బృహ : కలభాషిణీ! నీకు సంస్కృతము తెలియునా?

కల : అదేమి? గురూత్తమా! అ విధముగా నడుగుచుంటిరి? గీర్వాణము నాకు తెలియదా?

బృహ : గీర్వాణము తెలియకేమి? ఆ విషయమును పింగళి సూరనార్యు డెప్పుడో కని పెట్టినాడు!

గీర్వాణ భాష తెలిసినచో వాణీ మహాదేవి యిచ్చిన సమస్య కర్థము చెప్పుము!

కల : ఏమున్నది? అది యెంతో సులభము.

"కుందేలుచే శివుడు చంపబడెను", అనియేకదా! కావుననే మిమ్ము తల్లి ఇరుకున బెట్టినదంటిని. సర్వప్రాణిలయకారుడైన శివుడు ఒక చిన్ని కుందేలుచే – "కుందేలుచే చంపబడుటయా?"

బృహ : సరియే, అది నీ యూహము. నేను పూరించు చున్నాను కదా! అప్పుడు అసలు విషయము తెలిసికొందువు లెమ్ము! అవధారు, మహాసరస్వతీ!

"శశకం దృష్ట్వా, జిఘాంసుః
క్షేమం పప్రచ్ఛ జంబుకః
ఉపాయశాలి నైవచ
శశకేన హత శ్శివః"

తా: (ఒక నక్క కుందేలును చూచి దానిని చంపవలెనని యత్నించుచుండగా ఆ కుటిల ప్రయత్న మెఱిగిన కుందేలు, నక్కయే చనిపోవునట్టి ఉపాయ మాలోచించి నక్కను మట్టు బెట్టించెను)

కల : చిత్రముగ పూరించితిరిగదా అమర గురూ! నే నింతవరకు, ఊహింపలేదు! ఏమని పూరించితిరి? [శ్లోకము మఱలచదివి—అర్థము చెప్పును]. చానమ్మ మడివినట్లు మీరు సమస్త విద్యా పారంగతులు!

బృహ : కలభాషిణీ! నీవు నన్ను ప్రశంసించునంతటి జటిలత ఇందేమి యును లేదు—అది సరియే కానిమ్ము, మధురవాణీ! మీ యేలికయైన రఘునాథ భూపాలుడు తన లక్ష్మీ భువన సభా భవనమున నిండు పేరోలగముండి అందు నీకు కనకాభి షేకము జరిపెను గదా! పీఠికాపురమునుండి సరస్వతీ పీఠ

మును జయించి తంజపురియందు ప్రతిష్ఠించినపుడా? లేక - తనచే ఆంధ్రమున రచింపబడిన రామాయణమును, ... కోరికపై నీవు సంస్కృతీకరించినపుడా? రఘునాధ నాయకుడు స్వర్ణ పుష్పాభిషేక మొనర్చినదా? నీ మహత్వ పూర్ణ సాహిత్యారాధనమును సభవారికెఱుకపఱచవలెనమ్మా.

మధు : సురగురూ! అది యంతయు నిపు డెందులకు లెండు!

బృహ : ఇందు తప్పేమియు లేదు. సరస్వతీమతల్లిని నీ వేడ్కతో బంగారు పూవులతో పూజించి యుందువు. రంగాజమ్మకు గూడ అట్లే జరిగినది గదా! రఘునాథ నాయక, విజయ రాఘవ నాయకు లెట్టి పక్షపాతమునులేక, తమకాలము నాడే మహిళలకును మహిత పదవులను, స్థానములను ఇచ్చి గౌరవించిరి. ఆ మహా భాగ్యమునకు నోచుకొన్న మీ మహత్తర సాహిత్య సేవారాధనములు చరిత్రయందు నిక్షిప్తము లగుటతో సరిపోదు! ఆ గాథలు తగినంతగా విశ్రుతము కావలెనమ్మా!

మధు : మా ఏలికలగు నాయకరాజుల ఆదర భావమటుండ, పితృ తుల్యులగు మీరు సహృదయముతో, వాత్సల్యాభిమానములతో, యింతగా ప్రేరణ యిచ్చుచుండ నేను కాదందునా! [మధురవాణి తన సాహిత్య సేవను గూర్చి ప్రసంగించును]

సరస్వతీ సామ్రాజ్య వైభవము

తల్లీ! శారదా! రఘునాధరాయల ఆస్థానము నీ మృదుపాద మంజు శింజాన రంజితము. అందును-ఆ మహా ప్రభుడు కవయిత్రులనిన ఎంతో ఆదరము చూపెడివాడు! అట్టి యెడ, నేను సరస్వతీ పీఠమును తంజపురికి తరలించినను, ఆ మహాప్రభుని రామాయణమును సంస్కృతీకరించినను ఆ కవి సార్వభౌముని ప్రేరణనందియే. అనుట అతిశయోక్తికాదు. ఈ సంవిధానము ఎల్లలకు ఆదర్శము కావలెననుటయే నా ఆశయము.

బృహ : నీ రచనయిందలి ఒక శ్లోకమును విన్పింపుము మధురవాణీ!

మధు : మీ ఆజ్ఞ శిరసావహింతును గురువర్యా!

మధుర : రఘునాధ భూపునిచే రచింపబడి నాచే సంస్కృతీ కరింపబడిన రామాయణమునందలి శ్లోకము విన్పింతును.

భవ్యం విహాయ భుంతోమణిముద్రికేత్వాం
సామ్రాజ్య పాలన మంజులతాప్రకారే
పాదూద్వయం రఘుపతిం ప్రణయాద్యయాచే
కింనుస్తనామ్యహహ తత్కవితోపకారం

కల : అబ్బా! ఆనాటి మహిళలే ఇంత బృహత్తరమగు సారస్వత సేవ గావించి చరిత్రను సృష్టించిరన్నమాట! మరి - రంగా జమ్మా! నీ సేవ యెట్టిదో యొకింత తెలుపుము!

రంగా : నేమను - నా యోపినంత సేవచేసితిని. ఆ స్వరూప మిట్టిది- సంగీత సాహిత్య కళాపోషణలో అద్వితీయుడైన

రఘునాథ భూపాలుని ప్రియతనయుడై, ఆ తండ్రికి తగిన కుమారుడనిపించుకొనిన విజయరాఘవ నాయకుని ఆస్థానినైన నాకును ఎంతో గౌరవాదరములు లభించుట చేతనే, నేనును సారస్వత సేవచేసి ఆ రసహృదయుని కొలువున కనకాభిషేక మొందితినమ్మా!

బృహ : అమ్మా రంగాజీ! నీ విరచితమైన వ్యంగ్యోక్తి పూర్ణమైన చాటు వొకటి కలదు కదా! దానిని వినిపింపుము!

రంగా : అట్లే, అవధరింపుడు:-

ఏ వనితల్ మముందలపనేమి పనో? తమరాడవారు గా
రో. వలపించు నేర్పెఱుగరో, తమ కౌగిటలోన
మందగా
రావది యేమిరా విజయరాఘవ యంచిలు దూరి,
బల్మిమై
తీవరకత్తెనై, పెనగి తీసుకు వచ్చితినా, తలోదరీ!

బృహ : బాగున్నది– రంగాజీ! ఆ! మీ యందరకు మార్గదర్శకురాలైన మొల్లమాంబ తన రామాయణ కావ్యరచనకు ఎట్టి ప్రేరణనందినదో, తప్పక మనము తెలిసికోవలసి యున్నది నిజముగా ఆమెకు ఏ మహారాజుయొక్క ప్రేరణము లభింప లేదు కదా!

మొల్ల : నాకు రాజుల యొక్కయు, తరాజుల యొక్కయు ప్రేరణ యెందులకు? రాజరాజ పరమేశ్వరుడైన, సత్యపరాక్రమ డైన, ధర్మ విగ్రహుడైన శ్రీరామచంద్ర ప్రభుడే నాకు ప్రేరకుడై యుండగాఁ మానవ మాత్రుల ప్రేరణ యేల? నే నా విషయమును నా కావ్యముననే:-

"చెప్పుమని రామచంద్రుడు
చెప్పించిన పలుకుమీద
చెప్పెద. నే"నని చెప్పితివి కదా!

బృహ : ఎంత గొప్ప ఆలోచనము చేసితివి తల్లీ! రామాయణ రచనము నందు, నీ కింత విశ్వశ్రేయో భావన యున్నది. కావుననే సరళ సుందరమైన నీ రామాయణ కావ్యము ఆంధ్ర జనులు జుర్రున జూరుకొనుచున్నారు. తక్కిన సంగ్రహాంధ్ర రామాయణముల పేరే తెలియదు కదా! అది సరే కాని, నీ కావ్య రచనముపై నీకుగల అభిప్రాయమును వివరింపుము:-

మొల్ల : అట్లే సురగురూ:-

తేనె సోక నోరు తీయన యగురీతి
తోడ నర్థమెల్లఁ దోచకుండ
గూఢ శబ్దములను గూర్చిన కావ్యమ్ము
మూగ చెవిటివారి ముచ్చటగును.

బృహ : ఆహా! చక్కగ వాకృచ్చితివి! ఇక - తిమ్మక్కా, నీవు ఏ యుద్దేశ్యముతో సుభద్రా కళ్యాణ కావ్యమును రచించితివో యొకింత చెప్పిన వినవలెనని యున్నది.

తిమ్మ : అమరగురూ! నా పతిదేవులైన అన్నమాచార్యులవారు శ్రీ వేంకటేశ్వర భక్తి పారవశ్యముతో కీర్తన వాఙ్మయమునకు శ్రీకారము చుట్టుట జగద్విదితమే కదా! కవిత్వము చెప్పుట ఆ నాడు మాయింటి విద్య అన్ననూ, అతిశయోక్తి కాదు. ద్విపద సాహిత్యమైనచో ఆ బాల గోపాలమే కాక పామరులు సైతము అర్థము చేసికొనగలరు అను ఉద్దేశ్యముతో భారత మహా కావ్యమున ఇంపుసొంపులు కురిసిన సుభద్రా కళ్యాణమును ద్విపద కావ్యముగా రచియించితిని.

బృహ : అమ్మా! నీవు-నీ కావ్యమును మిక్కిలి మంజుల శైలిలో రచించియుంటివి. ఆ కావ్యమునుండి ఏదియేని ఒక ఘట్టమును వినిపింపుము!

తిమ్మ : అట్లే సురగురూ! నే నొనరించిన అర్జున వర్ణనమును వివరింతును:-

ఎగు భుజమ్ములవాడు మృగరాజు నడుము
నడచి పుచ్చుకొను నెన్నడుము గలవాడు
గరగరనివాడు, చక్కనివాడు, వతడు
గొప్ప కనులవాడు, కోదండ గుణకి

కొంకంబుతా బహు లమరినవాడు
వెన్నున మచ్చకల విభవంబు వాడు
బవిరి గడ్డము వాడు, పన్నిదం బిడిన
వెన్ను పెగడసాల వెసనాడ వచ్చు॥

బృహ : ఔ నౌను! నీవు చెప్పినది సముచితముగా నున్నది. వెలుగు రేఖలు విచ్చుకొని అంగణమంతయు కాంతితో ప్రకాశించు చుండ, చొచ్చుకొని వచ్చు వెలుగును కాదని చీకట్ల నెవ్వ రాహ్వానింతురు? నీ వావర్చంచు అజ్ఞాన వర్ణనము కడు ప్రశస్త ముగా నున్నది. వరలక్ష్మమ్మా! నీరచనకు ప్రేరణ మెట్టిది?

వర : సురగురూ! ఆంధ్ర సాహిత్య రంగమున విజయ విలాసాది సుందర ప్రబంధములను వెలయించిన చామకూర వేంకట కవి అనంతరము ప్రవర్తిల్లిన కవుల సాహిత్యమునందు భావశూన్యత ఏర్పడి మరల ఆధునిక ఆంధ్ర వాఙ్మయ పై తాళికులనదగు వీరేశలింగం పంతులు, గురజాడ మొద లగువారి రచనలతో ఒక గొప్ప అభ్యుదయ కవితకు ప్రారం భము జరుగుట జైనది. ఆ స్ఫూర్తి నందుకొని, నేనును వినూత్న ప్రక్రియ యగు లేఖా సాహిత్యమునకు శ్రీకారము చుట్టి, ఆనాటి సమాజమునందలి, మూఢాచారములను, దురా చారములను ఖండించుతూ లేఖా సాహిత్యమును ప్రారం భించితిని.

బృహ : వరలక్ష్మమ్మ అనుభవ మిట్లుండగా, మఱి నీవు గేయ రచనకు తలపడితి వేమమ్మా! విశ్వసుందరమ్మా!

విశ్వ : సురగురూ! వరలక్ష్మమ్మగారి కాలముననే గేయరచన స్ఫూర్తినంది యున్నది. గేయ రచనలో సామాన్య ప్రజానీకము సహితముఉత్తేజముపొందుటకు అవకాశమున్నందున, నే నా ప్రక్రియలో కవితా రచన పూనుకొంటిని.

బృహ : బాగున్నది. మహిళా వాఙ్మయ మంతయు ఆదికవి ఆదేశానుసారమో అనునట్లు, విశ్వశ్రేయస్కరముగా పరిఢవిల్లుట యెంతయు ప్రశంసనీయము. కలభాషిణీ! దిక్కులు చూచుచున్నావే మమ్మా:

కల : ఆఁ—మరియేమియు లేదు, సురగురూ! ప్రొద్దు తెలియుటకు అవకాశము లేనట్లుగా, గిరాందేవి కొలువున నిట్టి సత్కాలక్షేపము జరుగుచుండగా, ఘంటానాదమెవరు సేయుచుండిరా? అని యాలోచించు చున్నాను.

(తెరలోనుండి గంటలు వినబడును)

బృహ : ఔనౌను! అవి మహేశ్వర నృత్య లీలా ప్రదర్శనాహ్వానములు. తల్లీ! కొలువు చాలింతుమా!

సర : నేనును అదియే తలంచు చున్నాను.

సరస్వతీ సామ్రాజ్య వైభవము

(లేచి నిలువబడి అందఱ నాశీర్వదించును)

ఊడర్థము కాని సాహితివి, సూక్తిసుధార్ద్ర ఫలాశి
దన్పక

ల్పద్రుమ సన్నిభంబుగ నవారితరీతి, నవస్ఫుర ద్విభా
మాత్రిత రేఖ దీర్చు పువుబోణులు, మాన్యతన్ జగ
ద్భద్రము గూర్చు మీదు చిర భావ ప్రదీప్తికి
మంగళంబగున్॥

బ్రహ్మ : తథాస్తు॥

సరస్వతి : [సరస్వతి అభయ హస్తముతో లేచి నిలువబడి:]
అహం, రుద్రేభిర్వసుభిశ్చరామ్యహ
మాదిత్యైరుత, విశ్వేదేవైః
అహం మిత్రావరుణో, బిభర్మ్యహ
మింద్రాగ్ని అహమశినోభా॥
అహమేవ స్వయమిదం వదామిజుష్టం
దేవీ భిరుతమాను షేభిః
యంకామయే, తం తముగ్రం కృణోమి
తం బ్రహ్మాణం తమృషిం తం సుమేధామ్॥
అహం సువేపితరమస్య మూర్ధన్
మమయో నిరప్స్వ న్తః సముద్రే
తతో వితిష్ఠే భువనాను విశ్వో
తా మమూద్యాం వర్ష్మణోపస్పృశామి॥

[తన విశ్వరూపము ను ప్రదర్శించును — సరస్వతిపై ప్రకాశవంతమగు రోలింగ్ షేడ్స్ విరామము లేకుండా త్రిప్పుచు వేయవలెను.]

బృహ : యాదేవీ సర్వభూతేషు విష్ణుమాయేతి శబ్దితా, నమస్తస్యై, నమస్తస్యై, నమస్తస్యై, నమోనమః॥ ["నమస్తస్యై"- అందరూ అనవలెను] - యా దేవీ సర్వ భూతేషు చేతనేత్య భిధీయతే!।

అందరూ : నమస్తస్యై........

బృహ : యాదేవీ సర్వభూతేషు బుద్ధిరూపేణ సంస్థితా

అందరూ : నమస్తస్యై....

బృహ : యాదేవీ సర్వ భూతేషు శక్తిరూపేణ సంస్థితాః

అందరూ : నమస్తస్యై-

బృహ : యాదేవి సర్వభూతేషు కాంతి రూపేణ సంస్థితాః

అందరు : నమస్తస్యై-

[పై స్తవము జరుగుచుండగనే తెరదించవలెను]

## సమాప్తం

ఓం తత్సత్.

తరువాత బృహస్పతి సరస్వతి ఆజ్ఞపై కవయిత్రులను బహూకరింపుడని కోరును.

ఓం

# సరస్వతీ సామ్రాజ్య వైభవము

[సరస్వతీదేవి కొలువున మొల్ల, మధురవాణి, గంగాదేవి, రంగాజీ ముద్దుపళని, తరిగొండ వేంగమాంబ, కనుపర్తి వరలక్ష్మమ్మ, చానమ్మ మున్నగు వారు అధివసించి యుందురు]

సరస్వతి ఆగమనము తెలుపు వందిమాగధుల భద్రనినాదములు ఈ క్రింది విధముగ విన్పించుచుండును.

[తెర తొలగును]

అఖిలసృష్టి ప్రణవోద్భాసినీ భద్రమస్తుతే
త్రైలోక్య పరివ్యాప్త సకలాగమ నిగమ విద్యాకళాస్మిత
హాసినీ వందనమస్తుతే
భారత భారతీ శుభ వాఙ్మయ కళాధిష్ఠాత్రీ స్వాగత మస్తుతే
సర్వవర్ణ పద వాక్యార్థ స్వరూపిణీ, అనాది నిధనా పాతున స్సరస్వతీ
త్రిభువన సహస్ర ప్రాణి జిహ్వాసింహాసనాధినేత్రీ స్వాగతమస్తుతే

[ఈ నినాదములైన వెనుక సురగురుడైన బృహస్పతి]

బృహ: అనాదివో బృహతః పర్వతాదా!
సరస్వతీ యజతాగంతు, యజ్ఞం
హవందేవీ, జుజుషాణా, ఘృతాచీ
శగ్మాం నోవాచ ఉశతీ శృణోతు!!

[అని ఋగ్వేదోక్తముగా సరస్వతీ స్తవమొనర్చుచు ఆమెను వేదిక మీదికి తీసికొనివచ్చును. సరస్వతి ఆగమనముతో సభ

యేందలి కవయిత్రులెల్లరు లేచి సాదరముగా ఆమెకు నమస్కరించెదరు.]

[వీణా పాణియైన శారదాదేవి మయూరవాహన మధిష్ఠించి కొలువు దీరును. సరస్వతి కిరువంకల బృహస్పతియు, కల భాషిణియు కూర్చుందురు]

బృహ: సరియే! వాగ్దేవీ సంస్తవముతో నేటి సభ కుపక్రమింతము.

యాం విదిత్వాఖిల బంధం
నిర్మద్యా ఖిలవర్తనం యోగి
యాతి పరం స్థానం
సా మాం పాతు సరస్వతీ!!

[సరస్వతీ రహస్యోపనిషత్తు]

[అని సరస్వతిని స్తుతించును]

చదువుల తల్లీ! నీ చల్లనిచూపు లెవరిపై ప్రసరించునో వారెల్లరు రసరాజ్యాభిషిక్తులై తమ మహనీయ కావ్యానుశాసనమున శివేతరక్షతి కల్గించి అనంత సృష్టిని అవ్యాహతానంద ముద్రాంకిత మొనర్చి, త్రికాలావచ్ఛిన్నముగా ఏలుబడి సాగించుచున్నారమ్మా! అట్టి రసజ్ఞులలో కమనీయ కావ్యాత్మతో, రమణీయ రసమయ కవితా శిల్పాకృతులకు జీవముపోసిన కొంత ఆంధ్ర కవయిత్రులు నిన్ను కొలువ నేతెంచిరి. జగదంబా, నీ యాజ్ఞయైనచో ఈ కవయిత్రీమణులెల్లరు ఆంధ్ర సాహిత్యోద్యానమున తాము విరియించిన మనోజ్ఞ కవితా సురభిళ ప్రసూనములతో, నిన్నర్చించి, రవంత తడవు నిన్నలరింతురు.

సర: అవశ్యంభావ్యమైన అంశమిది. అమరాచార్యా! నాకును ఆహ్లాదకరమై పరమాదరణీయమైన సంవిధానమిది. నేల నాల్గు చెఱగులకు తమ కవితామృతమును, నెఱచూఱలిచ్చి, జగతీజనుల కానందము పంచి యిచ్చిన యీ కవయిత్రీమణుల కవితా మాధుర్యము చవి జూడవలె నని ఆకాంక్షగనే యున్నది.

బృహ: తల్లీ మీ యాజ్ఞ శిరసావహింతును! ధర్మ విగ్రహుడైన శ్రీరాముని మనసార సంస్మరించి రామాయణ కావ్యరచన మొనర్చి పవిత్రు రాలైన మొల్లమాంబ ముందుగా జగదంబను సంస్తవ మొనర్చును.

మొల్ల: (లేచి నిలువబడి పూవులు తీసికొని చేతులు జోడించి) ధన్యురాలను తల్లీ! ధన్యురాలను. ఉపనిషదుద్యాన కలకంఠియు, త్రిజగతీ విద్యాధి ష్ఠాత్రియు, విజ్ఞాన కల్పవల్లియు, అఖిల భూతాంతర్గత చైతన్యా కృతియునైన వాగ్దేవి మా కవితా మాధుర్యమును చవి చూడ నెంచుట మా భాగ్యము! సురగురూ! నా సంస్తవమును వినుడు:—

మేలిమి మంచుకొండ నుపమింపగజాలిన యంచ నెక్కి వా
హ్యాళి నటించి వచ్చు చతురాస్య నెదుర్కొని నవ్వుదేరగా
వాలికసోగ కన్నుల నివాళి యొనర్చి ముదంబు గూర్చు వి
ద్యాలయవాణి శబ్దముల నర్థములన్ సతతంబు మాకిడున్!

సురగురూ! ఇంకొక పద్యమున గీర్వాణిని స్తుతింతును:—

సదమల ప్రాజ్య విజ్ఞాన సామ్రాజ్య సం
గ్రహమైన గ్రంథ వ్రజమ్ముతోడ
సుమనో మనోహర సుమహితాక్షరమాలఁ
బురుడించు స్ఫటికాక్షసరముతోడఁ

కౌటిల్య జాటిల్య పాటవ మొనయని
కలికి పల్కుల రామచిలుకతోడ
సర్వాభిలషణీయ సత్యరేఖా వికా
సస్ఫూర్తిమత్సరోజమ్ముతోడ
సరస సంగీత సాహిత్య సంపుటస్త
నత్స్వసద్వల్లికి శ్రుతి నందితముగ
జగతి నాశీర్వదించు నిన్ బొగడదరమె?
తల్లి వాగ్దేవతా దేవతామ తల్లి!!

(పద్యమును చదివి ప్రసూనాంజలిని వాగ్దేవికి సమర్పించును.)

బృహ: శహబాసు! బాగుగా కూర్చితివి సరస్వతీస్వరూపమైన నీ కవితా మల్లికా ప్రసూనదామము భక్తిరస నిష్యందియై చదువులరాణి పద పద్మములనుండి స్రవించు మరందవాహినిగా మాధుర్యములు నించుచున్నదమ్మా!

కల : సురగురూ మెల్లను ప్రశంసింపవలసిన దర్మము నాయందున్నది.

బృహ: అట్లే కలభాషిణి, నీవు ప్రశంసించినట్లే యెంచెదము లెమ్ము. గంగాదేవీ! కంపరాయల కదనపాండితిని క్రమరీతిని మధురా విజయగాథగా, ప్రోహళించిన నైపుణి, నీ సొమ్ము! ఆగమవిపిన మయూరియైన ఈ జగజ్జనని నెట్లలరింతువో!

గంగ: సురగురూ! మీ తీయని యూహకు ఊపిరిపోయుటకై యత్నించె దను:-

ప్రకట మహార్థ భావ రసభాసుర కావ్యనిచయంబు సారస
ప్రకరముగా ధరించి మధురధ్వని సంభరిత ప్రసిద్ధనా
టక నిచయమ్ము సొంపగుకడాని పరాంగుల నిగ్గులొల్కు చం
పక సుమరాజిగా ముడుచు భారతి కంజలి గూర్తు నిచ్చలున్!!

బృహ: గంగాదేవీ, సాదు, సాదు, కలభాషిణి యభ్యర్థించినందున కాబోలు, కలకండలు గ్రుమ్మరించితివి!

కల: ఇది యేమి సురగురూ! నేనడిగితినని కలకండలచ్చులు పోసినదా! మీరాదేశించినను నట్లే యుండును. గంగా నిర్ఝర ప్రవాహమునకు ముల్లోకములం దెక్కడ నైనను, స్వచ్ఛతా సౌందర్యములు కొఱవడినవా?

బృహ: కలభాషిణి! నీతో నెట్లాడినను ముప్పవచ్చుచునే యున్నది- మొల్లను నేను ప్రశంసింపగా అది నీ కర్తవ్యమంటివి గదా యని ఇది నీ ప్రేరణయంటిని. అమ్మా! నీవు నిజముగా కలహభాషిణివి!

కల: భళిభళి! ఎంత చక్కని బిరుదునిచ్చితిరి? ఒక్కమాఱుగా, నాకు దేవ మౌని యంత స్థాయి పెరిగి పోయినది. కాని— దేవగురూ! ఈ బిరుదును నాపట్ల యింకను సార్థకపఱుపవలెనని,

బృహ: ఊఁ! -సార్థక పఱుపవలెనని—

కల: కలహాసభాషిణి యనవలెను!

ప్రోల: ఎంతో చమత్కారముగ మాట్లాడితివి. కాని ఆ, అర్థమున అది-

మధు: సరిపోవును లెమ్ము!

సర: భేష్! ఎంత వాఙ్నైపుణి యబ్బినదే-కలభాషిణి నీకు!

బృహ: మధురాంధ్రము మాననీయమను శ్లాఘ యొక్కమ్మడి చెలరేగవలె నమ్మా! మధురవాణి!

మధు: గురుసత్తమా: అవధరింపుడు!

జననీ నీ కరుణాకటాక్ష విలసత్సౌభాగ్య సంపత్తిచే
ఘన విజ్ఞాన కళాప్రపంచ విభవోత్కర్షమ్ము హర్షమ్ము, గూ
ర్ప! నవోత్తేజముగల్గు చిత్తమున సంప్రార్థింతు యుష్మద్దయాం
బునిధిన్ మున్గుచుదేల భాగ్యమిడుమా! పూర్ణానురాగమ్మునన్!
(నోటిపై వ్రేలుంచుకొని కలభాషిణి సలీలముగా చూచుచుండును)

ముద్దు: అదేమమ్మా! కలభాషిణీ! నీవిట్లు నోటిపై వ్రేలుంచుకొని ఉలుకక, పలుకక యున్నావు? గలగల పారు సెలయేరువలె నీవు కలభాషలతో పలుకకున్న ఈ సభ యెంతయు కళదప్పి చిన్నవోయినదమ్మా!

కల: నే నేమనినను సురగురువులు కస్సు బుస్సు మనుచున్నారు.

బృహ: కలభాషిణీ! నీతో నాకు కయ్య మెందులకమ్మా? నీవు పసికూనవు! నేనేమి చెప్పినను, నెయ్యముతోడనే! "బిడ్డా"—నీవు యథేచ్ఛగా నుండుము. శారదాదేవి కాలియందెల మెత్తని ఘలం ఘలలు సరిక్రొత్త శ్రుతులతో ఆనంద గీతికలల్లెనా యనునట్లు, తిమ్మక్కా నీవు భారతిని కీర్తింపవమ్మా!

కల: ఔనౌను— తిమ్మక్కా!

అక్కజమగు కవితలతో
చొక్కంబౌ తెల్గు శోభ చూపగదమ్మా!

విశ్వ: ఓహో! కలభాషిణి కూడ కవయిత్రి యైపోయినదే!

కల: ఓహో! సహవాస దోషమెంతైన చేయును.

మొల్ల: ఈ కవితా వ్యాసంగమును, సహవాస దోషముగా, భావించుచున్నావా? సురగురూ—వింటివే!

బృహ: ఆహో! వినుచునేయున్నాను. మఱల నా వ్యాఖ్యానమెందులకు లెమ్ము!

తిమ్మ: తల్లీ! శారదా!

చతుర కవిత్వ రమ్యరస సాగర పారగులౌ కవీంద్రు లే
సతి పదకంజద్వయ మచంచల భక్తి భజించి పెద్ద కీ
ర్తి గనినారలా యమ విరించి ముఖమ్ముల నిల్చుదేవి నే
సతతము గొల్చుచుండెదను స్వాదు కవిత్వ మహత్వసిద్ధికై!

బృహ: నే ననుకొనునట్లే తిమ్మక్క జాను తెనుగు పస జాలు వారునట్లు వీనులకు విందుగ కవిత సెప్పినది. ముద్దు పల్కుల నళినియగు ముద్దుపళని సుద్దుల నాలకింపవలెనని, నా మనస్సువ్విళ్ళూరుచున్నది

ముద్దు: అమరాచార్యా! ఆలింపుడు:_

లలితాత్యంత మనోజ్ఞ శబ్దయుతముల్ శయ్యాలిరమ్యంబులన్
విలసన్మంజుల భావశోభితములై వెల్గొందు కావ్యాళి ని
చ్చలు నే తల్లికటాక్షముల్ వెలిగి సంప్రార్థ్యమ్ముగున్ జెప్పనా
పలుకుల దొయ్యలి కెల్లవేళల నమోవాకమ్ము లర్పించెదన్!

బృహ: లెస్స బల్కితివి, పళనీ-లెస్సబల్కితివి. రంగాజీ సింగారములు పొంగులు వారగా నీ హృదయ తరంగిణినుండి, ఒక్క స్తుతి తరంగ మువ్వెత్తుగ లేచి వాగ్దేవీ పాదాభిషేక మొనరింప నుత్సహించుచున్నాము.

రంగా: అవశ్యము సురగురూ!

కలిగినవారి కోరికకె గాక భయంకర యుద్ధభూమిలో
నలిగెడివారికిన్ మహదనన్త మనోజ్ఞ పవిత్ర భావనల్
కలిగెడి లీల నీ కరుణ గంగగ పొంగును తారతమ్యముల్
కలుగని సుప్రసన్న నవకావ్య కళా మహితాత్మ శారదా!

బృహ: పద్య విద్యా రహస్యము తెలిసిన నీ కవిత ఎల్లప్పుడును ప్రశంస్యమే! ఇఁక - ఈ...!

కల: అదేమి గురువరా? "ఇంక - ఈ" అనుచున్నారు! మా తల్లిని కొని యాడు శుభావకాశమును ముగించుచున్నట్లున్నదే! తక్కిన కవ యిత్రులా భాగ్యమునకు నోచుకొనలేదా? మరి నామాట యేమి చేసితిరి!

బృహ: కలభాషిణీ! నీముచ్చట కాదనగలనా! ఉదాత్త రసభావ పద సంబంధ మైన నీ యెదదను - పదిల పఱచి, చదువుల తల్లి పదములకడ ఉపద గానిమ్ము! తక్కిన కవయిత్రుల కింకొక విధముగ ఆ యవకాశ మీయబడును.

కల: మీరిపుడు సెలవిచ్చినది బాగున్నది. భక్తి ప్రసూన సంభరితమైన దోయిలితో నా తల్లికి కై మోడ్పు లర్పింపవలెనను ఉబలాటమేకాని, నేనేమి? కవయిత్రినా! శిల్ప సౌందర్యములు వెల్లివిరియింప జేయుటకు! ఐననూ, నా తల్లి పూజయే కదా! నేర్చిన కొలదిగ కవితా కుసుమములను సేకరింతును. సురగురూ! ఆంధ్ర భారత భారతీ ప్రాగల్భ్య మొప్పగా స్తుతి నొనర్చెదను:-

వేదాంత తత్త్వార్థ విజ్ఞాన రూపమై
భాసిల్లు నేతల్లి పదము జంట?
ప్రణవార్థ సంస్మరత్ప్రవణమై నినదించి
శబ్దించు నేతల్లి స్వాదుజిహ్వ?
ఉపనిషదటవీ మయూరి యై సతతమ్ము
నర్తించు నేతల్లి జ్ఞాన పీఠి?
కరపద్మ భాసిత కచ్ఛపీ గాన వి
లోలయై యేతల్లి యోలలాడు?

భాసమాన ప్రత్యేక జిహ్వాసనయో
సకల ప్రకృతి జీవద్వాణి సంస్థయెవరు?
సర్వహృద్రసవాహియౌ సంవిదాత్మ
భారతీమూర్తి నా తల్లి ప్రస్తుతింతు?

అందరు: భళిభళీ! ఏమి ఉదాత్త కల్పన, ఏమి గంభీర శిల్పము?

బృహ: అప్పుడే వికసిన బొండుమల్లియలు సెలవివార నవ్వినట్లు, మెఱపులు గుంపులై యేతెంచి వెలుగులు వెదజల్లినట్లు, కలభాషిణీ! నీ కల్పనము విశదమై, విజ్ఞానాత్మకమై, పరమార్థతత్త్వ ప్రాపపణీయ యగు శారదా మహాదేవీ విశ్వతోరూపమును, కలవైఖరిని వర్ణించినది. అందుకే, పలుకులతల్లి నీకు "కలభాషిణి" అని పేరిడినది.

కల: ధన్యురాలను దేవగురూ! ధన్యురాలను
(వినమ్రాంజలియై పుష్పాంజలి సరస్వతి పదముల కడనుంచును.)

బృహ: ప్రోలమాంబా! నీకొక దత్తపది నొసంగుచున్నాను. దానితో రామాయణ పరముగా నొక పద్యమును చెప్పుము?

ప్రోల: ఏమది? సెలవిండు!

బృహ. ఇదిగో దత్తపది నిచ్చుచున్నాను. వినుము.
"శంక, లంక, వంక, గ్రుంక"

ప్రోల: సురగురూ! నాయీ కల్పనమును అవధరింపుడు:-

శంక తొలంగి లక్ష్మణుని స్వాస్థ్యము కోరుచు, నీ నిమేషమే
లంకను వీడి, ద్రోణమచలాంకము జేరియు, జీవ నౌషధీ
వంకకు తెమ్ము, తమ్మునకు ప్రాణములిమ్ము, నిశావిభుండు మున్
గ్రుంకక మూందటంచు వడి కోరెను రాముడు దంజనా సుతున్!!

బృహ: అమ్మా! మొల్లమాంబా! నీ యిష్టదైవమైన శ్రీ రామచంద్రుని సంస్తుతింపుము:-

మొల్ల: అటులనే గురూత్తమా-

శ్రీ మహిమాభిరాముడు వసిష్ఠ మహాముని పూజితుండు, సు
త్రామ వధూకళాభరణ రక్షకుడాశ్రితపోషకుండు, దూ
ర్వామల సన్నిభాంగుడు మహాగుణశాలి, దయాపరుండు, శ్రీ
రాముడు ప్రోచు భక్త తతి రంజిలునట్లుగ నెల్లకాలమున్!

ముద్దు: మహా కవయిత్రీ! నీ ప్రజ్ఞకు తగినట్లు ఉత్తమ కవితా శిల్పాకృతిని శ్రీరామచంద్రుని మలచి నిల్పితివి.

బృహ: చదువులతల్లి ఉత్సుకత చూపుచున్నది! వేంగమాంబకేమైన సమస్య నిచ్చెదరా!

వేంగ: (ధ్యాన నిమగ్నమై యుండును.)

సర: ఔను! నేనును అదియే తలంచుచున్నాను! సమస్య యెందులకు? తపస్వినీ, వేంగమాంబా! నీ యిష్టదైవమును స్మరింపుము తల్లీ!

వేంగ: ఏమంటిరి! నా యిష్టదైవమును వర్ణింపమంటిరా! కృతజ్ఞురాలను తల్లీ! అవధరింపుడు!

బహుళార్థసాధక బ్రహ్మాండ భాండంబు
పాలనాస్థితిసల్పు ప్రభుడెవండు?
దివ్యవక్షమ్మును దేవిలక్ష్మికినిచ్చి
మహిళ కున్నతిగూర్చు మహితుడెవడు?

శ్రీరామ కృష్ణాది చిన్మూర్తి తానయి
ధర్మోద్ధరణ సల్పె ధరణినెవడు?
దుష్టశక్తులమాపి దురితమ్ము తొలగింప
గీత బోధించు సుకృతి యెవండు?

శాంతిని, నహింస, ప్రేమను సత్యనిష్ఠ
భువి, నిలుప గాంధియౌ మహాత్ముండెవండు?
అట్టి శ్రీ వేంకటేశు సమర్చజేసి
భక్తి తరియింపరే కలి ప్రజలు మీరు!

బృహ: అమ్మా! వేంగమాంబా! నీ వేంకటేశ్వర మహాత్మ్యమునందలి పద్యము నొకదానిని విన్పింతువా!

వేంగ: అట్లే సురగురూ! వరాహావతారుడైన శ్రీ మహవిష్ణువునకును గరుత్మంతునకును జరిగిన సంభాషణను విన్పింతును!

ధారుణి నీటన్ మునిగిన
కారణమున దానినెత్తు కార్యంబున నీ
ఘోరాకారము దాల్చితి,
నారూపము జూచిలక్ష్మి నగదే? ఖగేంద్రా!

ఆ వైకుంఠ పురమ్మున
కేవిధమునవత్తు? "లక్ష్మి" యొకసక్కెముగా
నీవెవ్వడంచు నడిగిన
శ్రీవిష్ణుండనగ నాకు సిగ్గగు గరుడా!

బృహ: ముద్దు పళనీ! ఈ సమస్యను పూరింపుము-
"సానిన్ బూజలొనర్ప దక్కును, మహైశ్వర్యంబు నిక్కమ్ముగా"

ముద్దు: ఇదియేమీ సురగురూ! సానిపూజచే ఐశ్వర్యంబు లభించునా? సరియే పూరింతును వినుడు!

తేనెల్ జిట్టినరీతి నీయశము గీర్తింపన్ బ్రయత్నించు నీ
దానిన్ నన్ను కటాక్ష వీక్షములనుద్ధారింప రమ్మంచ నం
తానందమున భక్తి మీర నమితోత్సాహంబుతో శ్రీనివా
సా! నిన్ పూజలొనర్ప దక్కును మహైశ్వర్యమ్ము నిక్కమ్ముగా!

కల: ముద్దుపళనీ! బాగుబాగు-కానీ పళనీ- నీకావ్యగత మధుర శృంగారము మాటయేమి?

ముద్దు: అది రాధామాధవ పరమైనదిగదా! అందనౌచిత్యములేదు-కలభాషిణీ?

బృహ: అమ్మా! పళనీ! రాధికాసాంత్వనమందలి సత్యభామా మానవతీత్వ మాధుర్యమును మా కెఱింగింపుము!

ముద్దు: అవశ్యము, సురగురూ! నా రాధికా సాంత్వనమందలి నాయికయగు సత్యభామ తన మానవతీత త్వమునుగూర్చి ఇట్లాడినది-

సొమ్ము నీయవచ్చు! సొమ్మందు మియవచ్చు!
నియ్యరాని ప్రాణమియ్యవచ్చు!
తనదు విభుని వేరు తరుణి చేతికినిచ్చి
తాళవశమె యెట్టిదానికైన!

కల: ముద్దుపళనీ! నీవు వచించినట్లు రాధామాధవపరమైన శృంగారమును నీ కావ్యవస్తువుగా స్వీకరించుటచే అది, అనింద్యమే అయినది.

వర: నేనట్లు తలంచుటలేదు, కలభాషిణీ! పురుషులనేకులు, "కొందఱు మాత్రమేసుమీ!" లజ్జ విడచి అసభ్యశృంగారమును కావ్యములకెక్కించి ఊరేగించిరి. సిగ్గు సింగారముగానుండదగిన స్త్రీలుకూడా అట్టి రచనలనే చేసినచో నింక ఆదికవి నన్నయ భట్టారకుడు పలికించినట్లు కావ్యములు విశ్వశ్రేయస్కరము లెట్లగును? భూలోకమున ఇప్పటి జనుల విపరీత ప్రవర్తనకు, దుర్మార్గులు స్త్రీలయెడ కావించు అత్యాచారములకు ఇట్టి రచనలే కారణముకాదా?

బృహ: ఐనచో వరలక్ష్మమ్మా!

"ఛలము, ఫలము, చలము, స్థలము" అను పదములుపయోగించి భారత పరముగా నేటి యువతకొక సందేశమిమ్ము!

వర: దానికభ్యంతరమేమి? సురగురూ! అదియే నా ఆశయముకూడ!

ఛలమున జూదము గెలిచియు
ఫలమేగతి పడసితీవు? పాపీశకునీ
చలమున వర్తించియు, మహి
స్థలమేలేదయ్యె నీకు సజ్జనులంతన్!

బృహ: వరలక్ష్మమ్మా! ఈవిషయముపై నీకెంత దృఢమగు నభిప్రాయములు కలవో నీచెప్పినతీరున వ్యక్తమగుచున్నది. చాలస్పష్టముగా చెప్పితివి. లెస్సయగు, విశ్వసుందరమ్మా నీవు తెలుగుభాషా వాఙ్మయమును గేయ కవితను ఆంధ్రభాషను కీర్తింపవమ్మా!

వి.సుం: ఆట్లే సురగురూ-

మనసాహితి - మధుభారతి
తెలుగుజాతి ఘనకీర్తి

తెలుగన్నను వెలుగన్నను
ఒకటేయని ప్రకటించిరి

మనవారలు పెరవారలు
తెలుగన్నను తేనెయనిన
తియ్యదనము తియ్యదనము

తెలుగన్నను తెలివియనిన
తిన్నదనము మిన్నదనము

తెలుగన్నను దీప్తియనెదు
తృప్తిగనిరి ఘనులందఱు!

మధురాంధ్రము - మహనీయము
మాధుర్యపు సౌరధ్యము

మనభాషకె మనభాషకె
మాధుర్యపు టాధ్వర్యము
మనవాణిదె మనవాణిదె॥

బ్రహ: తెలుగునే విస్మరించుచున్న ఈనాడు తెలుగుజాతికి చిక్కని తెల్గు సౌందర్యమును విరియించు కవితజెప్పి ఈనాడు ఆంగ్లభాషకు బానిసలైనవారికి, కనువిప్పు గల్గించితివమ్మా! ఇదిగో మధురవాణీ! నీవీ సమస్యను పూరింపుము!

"సింహము లొంగెను చిఱుతకు చిత్రముగాదే"

మధు: ఏమిది సురగురూ! చిఱుతకు - అనగా - చిఱుతపులికి సింహము లొంగు టెచ్చటైన గాంచితిమే? అయినను, మీ ఆజ్ఞ దుర్విలంఘ్యము కదా! అట్లే పూరించు చున్నాను.

"రంహమున, గూల్చి యసుర, నృ
సింహుండుగ్రత విడువఁడు-చిఱుతండయ్యున్
రంహము ప్రహ్లాదు డుడిపె
సింహము లొంగెను చిఱుతకు చిత్రముగాదే!"

బృహ: ఎంతబాగుగా పూరించితివి - మధురవాణీ! చక్కని ఊహాపద్ధతి చిక్కని శైలీవిన్యాసము! అట్లుండవలె కవిత యనిన. గంగాదేవి ఈనాటి సరస్వతీ సామ్రాజ్య కవితావైభవమును వర్ణింపుమమ్మా!

గంగ: సరిగా ఇదేభావన నాకు కల్గినది. ఇంతలో మీరు సెలవిచ్చితిరి!

తెలుగుల కవితా సరసిని
మొలచిన రమ్యారవింద ముకుళములనగా
వెలసెను కవయిత్రులు, కవి
తలివియు, నకలంక భావతరళము లొచున్!

బృహ: ఆహా! ఈసభావైభవమునకు దగిన ప్రాభవకల్పన! వాణమ్మా ఈ అంశముపైననే, నీవు నీ భావములను ప్రోదిసేయుము!

వాణ: అట్లే అమరాచార్యా!
నీరజగత భ్రమర ఝుం
కారములోయన సురగతి గగనమునిండెన్.

కలః (సగములో అందుకొని)

శారద వీణానాదోం
కారములు సెలగె మృదుతర గంభీరగతిన్!

అందరు: అద్భుతము! అద్భుతము. కలభాషిణి కల్పన యద్భుతము.

సర: అమరాచార్యా! మిమ్ము పరీక్షించుటకు కాదుగాని, మీ అద్భుత ప్రజ్ఞాపాండిత్యములు లోకమునకు తెలియుటకై, మీకు సంస్కృతమున నేనొక సమస్యనిచ్చుచున్నాను! పూరింపుడు!

బృహ: అవశ్యముగా పూరించెదను - తల్లీ! సెలవిందు!

సర: "శశకేన హతశ్శివః"

కల: తల్లీ! నిలింప గురువులను ఎంత ఇరుకున బెట్టితిరి? ఆలోచింప వలసినదే!

బృహ: కలభాషిణి నీకు సంస్కృతము తెలియునా.

కల: అదేమి గురూత్తమా! ఆ విధముగా నడుగుచుంటిరి? గీర్వాణము నాకు తెలియదా!

బృహ: గీర్వాణము తెలియకేమి! ఆ విషయమును పింగళి సూరనార్యు డెప్పుడో కనిపెట్టినాడు! గీర్వాణభాష తెలిసినచో వాణీమహాదేవి యిచ్చిన సమస్య కర్థముచెప్పుము!

కల: ఏమున్నది? అది యెంతో సులభము.

"కుందేలుచే శివుడు చంపబడెను" అనియేకదా! కావుననే మిమ్ము తల్లి ఇక్కడున బెట్టినదంటిని, సర్వప్రాణిలయకారుడైన శివుడు ఒక చిన్న కుందేలుచే- "కుందేలుచే చంపబడుటయా"?!

బృహ: సరియే అది నీయూహ! నేను పూరించుచున్నానుకదా! అప్పుడు అసలు విషయము తెలిసికొందువులెమ్ము! అవధారు-మహా సరస్వతీ!

శశకం దృష్ట్వా, జిఘాంసుః
క్షేమం ప్రపచ్ఛ జంబుకః
ఉపాయశాలి నైవచ
శశకేన హతో శ్శివః

కల: చిత్రముగ పూరించితిరిగదా, అమరగురూ! నేనింతవరకూహింపలేదు. ఏమని పూరించితిరి? (శ్లో॥ మరల చదివి అర్థముచెప్పును)* మీరు సమస్త విద్యాపారంగతులు!

బృహ: కలభాషిణీ! నీవు నన్ను ప్రశంసించునంతటి జటిలత యిందేమియును లేదు. అని సరియే కానిమ్ము. మధురవాణీ! ఏ యేలికప్రైన

---

* ఒక నక్క కుందేలునుచూచి, దానిని చంపవలెనని ప్రయత్నించు చుండగా ఆ కుందేలు నక్కకుటిల ప్రయత్నము నెఱిగి ఆ నక్కయే చనిపోవునట్టి ఉపాయము నాలోచించి మట్టు పెట్టించును.

రఘునాథభూపాలుడు తన లక్ష్మీభువనసభా భవనమున నిండు పేరోలగముండి, అందు నీకు కనకాభిషేకము జరిపెనుగదా- పీఠికా పురమునుండి సరస్వతీ పీఠమును జయించి తంజపురియందు ప్రతిష్ఠించినపుడా, లేక- తనచే ఆంధ్రమున రచింపబడిన రామయణ మును తన కోరికపై నీవు సంస్కృతీకరించినపుడా- రఘునాథ నాయకుడు స్వర్ణపుష్పాభిషేకమొనర్చినది? నీ మహత్వ పూర్ణ సాహిత్యారాధనమును సభవారి కెఱుక పఱచవలెనమ్మా!

మధు: సురగురూ! అది యంతయు నిపుడెందులకులెండు.

బృహ: ఇందు తప్పేమియునులేదు. సరస్వతీమతల్లిని నీవేనాడో బంగారు పూవులతో పూజించియుందువు- రంగాజమ్మకుగూడ అట్లే జరిగినది గదా- రఘునాధనాయక, విజయరాఘవనాయకులెట్టి పక్షపాతములేక, తమ కాలమునాడే మహిళలకును మహిత పదవులను, స్థానములను ఇచ్చి గౌరవించిరి. ఆ మహా భాగ్యమును నోచుకున్న మీ మహత్తర సాహిత్యసేవారాధనములు చరిత్రయందు నిక్షిప్తము లగుటతో సరిపోదు. ఆ గాథలు తగినంతగా విశ్రుతముకావలెనమ్మా!

మధు: మా ఏలికయగు నాయకరాజుల ఆదరభావమటుండ, పితృతుల్యులగు మీరు సహృదయముతో, వాత్సల్యాభిమానములతో, ఇంతగా ప్రేరణ యిచ్చుచుండ నేను కాదందునా?

"తల్లీ! శారదా, రఘునాధరాయల ఆస్థానము భవదీయ మృదు పాద మంజు శింజాన శింజితము- అందును, ఆ మహాప్రభుడు

కవయిత్రులనిన ఎంతయో ఆదరము చూపెడివాడు. అట్టియెడ నేను సరస్వతీ పీఠమును తంజపురికి తరలించినను, ఆ కవి సార్వభౌముని ప్రేరణనందియే అనుట అతిశయోక్తికాదు. ఈ సంవిధానమెల్లరి కాదర్శము కావలెననుటయే, నా ఆశయము."

బృహ: మధురవాణీ! నీ రచనయందలి ఒక శ్లోకమును వినిపింపుము.

మధు: అవధరింపుము సురగురువర్యా! రఘునాథరాయని సభాభవనమును నాడిట్లు వర్ణించియుంటిని:-

హేమ్నాకృతం యత్ర మహాకటాహం
హిరణ్యగర్భాండ మివ ప్రతిమ్నం
తథానచేత్ కింతుతదీయగర్భే
భూయాంసి నిత్యం భువనానిసంతి.

కల: అబ్బా- ఆనాటి మహిళలే ఇంత బృహత్తరమగు సారస్వతసేవ గావించి, చరిత్రను సృష్టించిరన్నమాట. మఱి, రంగాజమ్మా! నీ సేవయెట్టిదో ఒకింత దెలుపుమమ్మా!

రంగా: నేనును, నాయోపినంత సేవచేసితిని. ఆ స్వరూపమిట్టిది. సంగీత సాహిత్య కళాపోషణలో అద్వితీయుడైన రఘునాథభూపాలుని ప్రియతనయుడై, ఆ తండ్రికి తగిన కుమారుడనిపించుకొనిన విజయ రాఘవనాయకుని ఆస్థానినైన నాకును, ఎంతయో గౌరవాదికములు లభించుటచేతనే, నేనును సారస్వత సేవచేసి ఆ రసహృదయుని కొలువున కనకాభిషేక మొందితినమ్మా!

కృపా: అమ్మా! రంగాజీ! వ్యంగ్యోక్తి పూరకమైన నీ చాటువొకటి కలదు కదా— దానిని వినిపింపుము.

రంగా: అటులనే- అవధరింపుడు:-

ఏపసితల్ మముందలప నేమిపనో? తమరాడువారు గా
రో? వలపించు నేర్పెరుగరో? తమ కౌగిటలోన నుండగా;
రావది యేమిరా - విజయరామ? యటంచిల దూరి బిల్కమై
దీవరకత్తెనై పెనగి తీసుక వచ్చితినా తలోదరీ?

కృపా: వీరందరకు మార్గదర్శకురాలైన మొల్లమాంబ తన రామాయణ కావ్య రచనకు ఎట్టి ప్రేరణనందినదో, తప్పక మనము తెలిసికొనవలసి యున్నది. నిజముగా ఆమెకు ఏ మహారాజుయొక్క ప్రేరణయు లభింపలేదు కదా.

మొల్ల: నాకు రాజులయొక్కయు, తరాజులయొక్కయు ప్రేరణయెందులకు, రాజరాజ పరమేశ్వరుడైన, సత్యపరాక్రముడైన, ధర్మవిగ్రహుడైన శ్రీరామచంద్ర ప్రభుడే నాకు ప్రేరకుడై యుండగా, మానవమాత్రుల ప్రేరణయేల? నేనావిషయమును నా కావ్యముననే—

"చెప్పుమని రామచంద్రుఁడు చెప్పించిన పలుకుమీద చెప్పెద,నే"
నని చెప్పితినిగదా!

కృపా: ఎంత గొప్ప ఆలోచన చేసితివి తల్లీ- రామాయణ రచనమునందు నీకింత విశ్వశ్రేయోభావమున్నది. కావుననే సరళ సుందరమైన నీ రామాయణ కావ్యమును, ఆంధ్ర జనులు జాబ్బన జూరుకొను

చున్నారు. తక్కిన సంగ్రహాంధ్ర రామాయణముల పేరే తెలియదు కదా- ఇదిసరే- తిమ్మక్కా! నీవు ఏ యుద్దేశ్యముతో సుభద్రా కళ్యాణ కావ్యమును రచించితివో యొకింతచెప్పిన వినవలెనని యున్నది.

తిమ్మ: అమరగురూ! నా పతిదేవులైన అన్నమాచార్యులవారు శ్రీ వెంకటేశ్వర భక్తి పారవశ్యముతో కీర్తన వాఙ్మయమునకు శ్రీకారము చుట్టుట జగద్విదితమేకదా- కవిత్వము చెప్పుట ఆ నాడు మా యింటి విద్య యన్నను అతిశయోక్తికాదు- ద్విపద సాహిత్యమైనచో ఆబాల గోపాలమేకాక పామరులు సైతము అర్థము చేసికొనగలరను ఉద్దేశ్యముతో భారత మహా కావ్యమున ఇంపుసొంపులు కురిసిన సుభద్రా కళ్యాణమును ద్విపద కావ్యముగా రచియించి యుంటిని.

బృహ: అమ్మా! నీవు నా కావ్యమును మిక్కిలి మంజుల శైలిలో రచించి యుంటివి. ఆ కావ్యమునుండి ఏదియేని ఒక ఘట్టమును వినిపింపుము.

తిమ్మ: అట్లే సురగురూ! నేనొనరించిన అర్జునవర్ణనమును వివరింతును-

" ఎగు భుజమ్ములవాడు మృగరాజునడుము
నడచి పుచ్చుకొను నెన్నడుముగలవాడు
గరగరనివాడు చక్కని వాఁడునతడు
గొప్ప కన్నులవాడు కోదండగుణ కి

కాంకంబులో బాహు లమర్చినవాడు
వెన్నున మచ్చగల విభవంబువాడు
బవిరి గడ్డమువాడు, పన్నిదంబిడిన
వెన్ను పగడసాల వెసనాడవచ్చు"

బృహ: నీవొనర్చిన అర్జున వర్ణనము కడు ప్రశస్తముగ నున్నది. వరలక్ష్మమ్మా! నీ రచనకు ప్రేరణ యెట్టిది?

వర: సురగురూ! ఆంధ్రసాహిత్యరంగమున విజయవిలాసాది సుందర ప్రబంధములను వెలయించిన చేమకూర వెంకటకవి - అనంతరము ప్రవర్తిల్లిన కవుల సాహిత్యమునందు భావశూన్యత ఏర్పడి మరల ఆధునిక ఆంధ్ర వాఙ్మయ వైతాళికులనదగు వీరేశలింగంపంతులు, గురజాడ మొదలగువారి రచనలతో ఒక గొప్ప అభ్యుదయ కవితకు ప్రారంభము జరుగుట యైనది. ఆస్ఫూర్తి నందుకొని నేనును వినూత్న ప్రక్రియ యగు లేఖాసాహిత్యమునకు శ్రీకారము చుట్టి అనాటి సమాజమునందలి మూఢాచారములను, దురాచారములను ఖండించుచు లేఖాసాహిత్యమును ప్రారంభించితిని.

బృహ: వరలక్ష్మమ్మ అనుభవమిట్టిదని, మరినీవు గేయరచనకు తలపడితివే మమ్మా, విశ్వసుందరమ్మా.

విశ్వ: సురగురువర్యా! వరలక్ష్మమ్మగారి కాలమునకే, గేయరచన స్ఫూర్తి నందియున్నది. గేయ రచనలో సామాన్య ప్రజానీకము సహితము

ఉత్తేజము పొందుటకు అవకాశమున్నందున నేనా ప్రక్రియలో కవితారచనకు పూనుకొంటిని.

బృహ: బాగున్నది. మహిళా వాఙ్మయమంతయు, ఆదికవి ఆదేశానుసారమో అనునట్లు విశ్వశ్రేయస్కరముగా పరిఢవిల్లుట యెంతయు, ప్రశంసనీయము.

బృహ: కలభాషిణీ! దిక్కులు చూచుచున్నావేమి?

కల: మఱి యేమియు లేదు సురగురూ! ప్రొద్దుతెలియుటకు అవకాశము లేనట్లుగా గిరాందేవి కొలువున నిట్టి సత్కాలక్షేపము జరుగుచుంతగా, ఘంటానాదమెవరు సేయుచుండిరా? యని ఆలోచించుచున్నాను.

(తెరలోనుండి గంటలు వినిపించును)

బృహ: ఔనౌను- అవి మహేశ్వర నృత్యలీలా ప్రదర్శనాహ్వానములు। తల్లీ! కొలువు చాలింతుమా?

సర: అవశ్యము- అటులనే కానిండు.

(లేచి నిలువబడి అందఱను ఆశీర్వదించును)

క్షుద్రముకాని సాహితిని, సూక్తి సుధార్ద్ర ఫలాళిదన్పుక
ల్పద్రుమ సన్నిభంబుగ నవారితరీతి, నవస్ఫుర ద్విభా
విద్రుతితరేఖ దీర్పు పువుబోణులు మాన్యతన్ జగ
దృద్రముగూర్పు మీ రుచిరభావ ప్రదీప్తికి మంగళంబగున్॥

బృహ: తథాస్తు! యా దేవీ సర్వభూతేషు విష్ణుమాయేతి శబ్దితా,

నమస్తస్యై, నమస్తస్యై, నమస్తస్యై; నమోనమః

( "నమస్తస్యై" అందరూ అనవలెను )

యాదేవీ సర్వ భూతేషు చేతనేత్యభిధీయతే॥

అందరు: నమస్తస్యై

బృహ: యాదేవీ, సర్వభూతేషు, బుద్ధిరూపేణ సంస్థితా!

అందరు: నమస్తస్యై

బృహ: యా దేవీ సర్వభూతేషు కాంతి రూపేణ సంస్థితా!

అందరు: నమస్తస్యై (పై స్తవము జరుగుచుండగనే తెరదించవలెను)

సమాప్తము

" ఓం తత్ సత్ "





తల్లి : నాళము సుశీలమ్మ

తండ్రి : 'మధురకవి'
నాళము కృష్ణారావు

భర్త : ఊటుకూరి హయగ్రీవ
గుప్త, అడ్వకేట్

కళాప్రపూర్ణ, కనకాభిషిక్త,
డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

ఇతర రచనలు - కొన్ని ముఖ్యమైనవి :

1] ఆంధ్ర కవయిత్రులు
2] అఖిల భారత రచయితలు
3] ఆంధ్రుల కీర్తన వాఙ్మయ కళాసేవ
4] నా తెలుగు మాంచాల
5] కన్యకా సుప్రభాతమ్ - సంస్కృత కావ్యము
6] ఒక్క చిన్నదివ్వె
7] కాంతి శిఖరాలు
8] మన సాహితి మధుభారతి
9] లజ్జాకిరీటధారిణి
10] కన్యకమ్మ నివాళి